# "నాకు కావాలి - సన్-సిప్ తేవాలి!"






## కొత్తది సన్-సిప్ స్క్వాష్‌లు

**ఆరంజ్, మేంగో, లెమన్**

ప్రతిరోజూ సన్-సిప్ తాగండి...నోరూరించే
ఈ మూడు రుచులలో దేనినైనా సరే
నేడే కొనండి మీ ఊళ్ళోదొరికే వాటిల్లో
తాజా అయిన పండ్ల రుచిగల స్క్వాష్‌లు

**తాజాదనంచిందించే ఆ పండ్ల రుచిని
అనుభవించి చూడండి–నేడే**

everest/79/WL/120





# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]
శుక్రవారం : 25-5-'79
సిద్ధార్థి నామ సం. వైశాఖ బ. అమావాస్య
సంపుటము 72 : సంచిక 37

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయ సూచిక



కథలు :

సీరియల్ కథలు :



వ్యాసాలు, శీర్షికలు :

# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు




భారతదేశంలో అత్యధిక గృహిణులు మెచ్చిన
సూపర్ 777 డిటర్జెంట్ వాషింగ్ బార్.

హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో

## ముఖచిత్రం

4 5 79న తేదీతో వెలువడిన పత్రికపై [illegible] యువతహృదయ సామ్రాజ్ఞిలాగుంది. కమల్‌హాసన్ చాలాబాగున్నాడు. మహేష్ (వారఫలం) మృతి చెందారన్న వార్త చదివి చాలా బాధపడ్డాము. బుచ్చిబాబుగారి ధర్మపథంలో మహర్షుల ప్రభావం చక్కగా ఉన్నది. ఎర్రగీతలు, కన్నీళ్లు, కథలు బాగున్నాయి.

పెన్మెత్స సూరిబాబు, బాషా, తేజో సూర్య, (హైదరాబాద్.)

# ఉత్తరాలు.

### కథలు

11—5—79 శోభన్‌బాబు, శ్రీదేవి ముఖచిత్రంతోనున్న ఆంధ్రసచిత్ర వారపత్రికను ఎంత వర్ణించినా తక్కువే అవుతుంది. పందెంలో పై చేయి, కరుణ కథలు మాకు చాలా నచ్చాయి. పందెంలో పైచేయి రచయిత్రిగారైన అప్పర్ణ గారికి మగవాగంటే గిట్టనట్టుంది. ఎందుకంటే మగవారంతా ప్రద్యుమ్నరావులాగా చపల బుద్ధిగా ఉంటారనుకోవడం అప్పర్ణగారి పొరపాటు. కరుణ కథను పరమహంసగారు ఎంతో చక్కగా వ్రాశారు. కరుణ అనేది ప్రతి మానవునికీ అవసరము. కరుణ లేని మనిషి, మనిషే కాడు.

పోట్ల శ్రీనివాసరావు, కాంచులాపురం ఉపేందర్ రెడ్డి, జె. చెన్నయ్య, ఎ. లక్ష్మీరాజ్యం, శ్రీమతి సావిత్రి, జె. రాజేశ్వరి. (జనగామ).

* *

27—4—79 నాడు టీవ ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చూడముచ్చటగా ఉంది.

కథలు చాలాబాగా ఉన్నవి. యోగి–భోగి కథలో వారిద్దరికీగల సంతోషంలో ఎంత తేడా ఉందో చాలా బాగా తెలిపారు.

సుమిత్రా చంద్రశేఖర్, (మహబూబ్‌నగర్)

* * *

ముఖచిత్ర ప్రచురణలో ఆంధ్ర పత్రికకు ప్రత్యేక స్థానం ఉంది. ఈ వారం కథలు 'పందెంలో పై చేయి' 'కరుణ' బాగున్నాయి. కథల సంఖ్య పెంచవలసిందిగా కోరుతున్నాము. ఫాలాక్షుని డైరీ, సినిమా శీర్షికలు ప్రతి వారిని ఆకర్షవంతంగా ఉన్నాయి.

కైపా కృష్ణమూర్తి, రామనాద్, సతీష్. (మదనపల్లె)

* * *

శోభన్‌బాబు, శ్రీదేవి ముఖారవిందంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వార పత్రిక మమ్మల్ని ఉర్రూతలూగించింది. పందెంలో పై చేయి 'కరుణ కథలలో కొత్తదనం ఎంతో గలదు. సహజత్వానికి దగ్గరగానుండి మమ్మల్ని ఎంతో ఆకర్షించింది, 'జీవిత మాధుర్యం' హాయిగా సాగిపోతుంది. ఇది ఒక ఫింధశాల సీరియల్ ప్రారంభంలో ఆకట్టుకున్నది కాకుండా ఈవారంకూడా మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది.

వై. హేమసుందరరావు, హేమబిందు, (డోర్నకల్)

### ఫాలాక్షుని డైరీ

శోభన్‌బాబు, శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన 11—5—79 ఆంధ్రసచిత్ర వార పత్రిక అందాలను విరజిమ్ముతూ చాలా మనోహరంగా ఉంది. 'ఫాలాక్షుని డైరీ' ద్వారా ఎన్నో తెలియని వింత విషయాలను తెలుసుకుంటున్నాము. కరుణ కథచాలా బాగుంది.

ఎం. హరనాద్, ఎం. రంగనాద్, (బెల్లంపల్లి)

### కీ శే. మహేష్

కమలహసన్ ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చాలా బాగుంది. 'ధర్మ పథం' వారంవారం తప్పకుండా చదివిస్తోంది. వారఫలం శీర్షిక నిర్వహించే మహేష్‌గారి మరణం తీరని లోటు. వారికి మా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

కె. అశోక్, కుమార్, (జడ్చర్ల.)


సోడాలన్నీ
ఒకే తరహాకి
చెందినవి కావు
... అందులో కొన్ని
విశిష్ఠమైనవిగా
ఉద్భవించాయి.
SPENCER'S
SPECIAL
SODA WATE
స్పెన్సర్స్ సోడా
చిరకాలంగా పిన్న పెద్దల మన్ననలను పొందిన విశిష్ఠమైన పానం.
స్పెన్సర్ & కం. లిమిటెడ్
S 2938 TEL

# రాగరేఖలు

ఆకాశం అరుణరాగ రంజితమై వుంది. సంధ్యారాగరేఖలు మనోహరంగా మెరుస్తూ ఉన్నాయి. భూమిని మైమరపిస్తూ ఉన్నాయి.

సంధ్యా సౌందర్యాన్ని తిలకించడానికా యేమంటే మేమని వంతులు వేసుకుని వస్తున్నట్లు పక్షులు కిలకిలారావాల్తో జట్లు జట్లుగా ఎగిరి వస్తున్నాయి.

విశాలమైన ఉన్న చెట్లు ఆ చిత్రాన్ని చూస్తున్నాయి. చెట్లను ఆగి ఆగి స్పృశిస్తోంది పిల్లతెమ్మెర. ఆ స్పర్శకు పులకించిన చెట్లు కమ్మని సుగంధాన్ని అందిస్తున్నాయి. ముగ్ధ మనోహరంగా వుంది వాతావరణం. పబ్లిక్ గార్డెనంతా రకరకాల మనుష్యులతో నిండిపోయి వుంది.

చిన్నపిల్లలు కలకల లాడుతూ ఆడుకుంటున్నారు. పెద్దవాళ్ళు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళలో కొంతమంది ఏవేవో ఇంటి విషయాలు చర్చించుకుంటున్నారు. ఊసులాడుకుంటున్నారు మరికొంతమంది ప్రకృతి సౌందర్యానికి తన్మయులవుతున్నారు, ఇంకొంతమంది.

ఎవరి మనస్థితిని బట్టి వారున్నారు.

నవ్వులి వచ్చికపీఠ- చక్కని చెట్టు కింద కూర్చుని వున్నారు, ఇద్దరు! ఒక మధ్య వయస్కుడూ- ఒక అపురూప లావణ్యవతి. అతడు సుమారు నలభై ఏళ్ళ మధ్య వుండవచ్చు. గంభీరమైన- చక్కటి విగ్రహం అతడిది. మంచి స్ఫురద్రూపి. చూసిన వాళ్ళని ఇట్టే ఆకర్షించే వ్యక్తిత్వం గల మనిషి. కాంతి వంతమైన కళ్ళు. చిరునవ్వును చిందించే పెదవులు. ఆ చిరునవ్వుకు భాష్యం చెప్పడం ఎవ్వరికీ సాధ్యం కాదు- అనిపిస్తుంది. అతడు మురళీకృష్ణ.

ఆ అమ్మాయి- ఇరవై, ఇరవై రెండేళ్ళ వయసు వుండవచ్చు వచ్చటి శరీర ఛాయగా- విశాలమైన కళ్ళూ- దట్టమైన కనురెప్పలు- ఆ రెప్పలవల్లే కళ్ళకి మరింత అందం వచ్చిందేమో ననిపిస్తుంది. సంపంగి నాశిక- సొట్ట బుగ్గలు- -నవ్వని పెదవులూ- నవ్వితే తళుక్కున మెరిసే అందమైన పలువరసా- చూడగానే కళ్ళు తిప్పుకోలేని సౌందర్య మామెది.

ఆ అమ్మాయి ఒక శిల్పసుందరి. ఆ ఇద్దరూ ఎదురెదురుగానే కూర్చుని వున్నా-

ఎవరి ఆలోచనలలో వాళ్ళు వున్నారు.

చాలా సేపు ఏమీ మాట్లాడుకోలేదు.

చింతో సేపటి తరువాత ఏదో ప్రశ్నించ దల్చినట్టు కృష్ణ ముందుకి వంగి- "అమ్మా- శిల్పా..." అన్నాడు.

ఏమిటన్నట్టు చూసింది శిల్ప.

"ఏం లేదమ్మా... నీ ఎం. ఏ. పూర్తయింది కదా... ఏం చేద్దామనుకుంటున్నావు?-"

"ఏముంది బాబాయ్... మీ రేమంటే అదే. కానీ... ఏదన్నా జాబ్ చెయ్యాల



మంది నాకు... మీరు సరేనంటే..." శిల్ప కుతూహలంగా చూసింది.

కృష్ణ కాసేపు మౌనంగా వుండి— ఆ తరువాత అన్నాడు.

"నీకింక సంబంధాలు చూడాలనుకుంటున్నానమ్మా. నువ్వు... నువ్వడిగి... అదే ... నీతో చెప్పి మొదలు పెడదామని!"

ఏమీ మాట్లాడలేదు శిల్ప.

"ఏమమ్మా- ఏమంటావు?...ఇంక నామీద ఆ బాధ్యత ఒకటి వున్నది"

"నా అభిప్రాయం చెప్పమంటారా బాబాయ్! నేను...నేను...పెళ్ళి చేసుకోను. మీరు నాకోసం మీ సుఖాలన్నీ వదులుకున్నారు. ఇంక మిమ్మల్నిప్పుడు చూసుకోవడం నావంతు. నాకు ఇంత చేసి నన్ను ఈ మాత్రపు దాన్నిగా నిలబెట్టినందుకు నేను మీకు ప్రతిఫలంగా ఏదీ చెయ్యలేను. కనీసం మీకు తోడుగా వుండి, మీకు కావలసినవి అమరుస్తూ వుండిపోతాను. నాకు పెళ్ళివద్దు. పెళ్ళి చేసుకుని నేను స్వార్థపరురాలిలాగా వెళ్ళిపోలేను."

"అది కాదమ్మా ... నా మాట విను. ఆడపిల్లకి ఒక అండ అవసరం".

"ఏం మగవాడికి అవసరం లేదా?" రోషంగా అంది శిల్ప!

నవ్వాడు కృష్ణ.

"మరీ చిన్న పిల్లలాగా వాదించకు — నీకింకా చిన్నతనం పోలేదు. నాకిప్పటికీ నువ్వు ఆనాటి శిల్పలాగే కనబడతావు."

ఎన్ని విధాల నచ్చచెప్పినా శిల్ప వినలేదు.

"నాకు మీరు అండ- నేను మీకు అండ. ఇన్నాళ్ళు ఇలాగే వుండాము. ఇప్పుడు మనకేం తక్కువయిందని."

ఒకటే మొండి వాదన.

"ఇది తెలదమ్మా నీ కర్తవ్యం కాదు." గొణుక్కున్నాడు కృష్ణ.

ఈ మధ్య తరచుగా వినబడుతున్న ఈ పెళ్ళింటి మాటలు తను శిల్పకు చెప్పలేదు. చెప్పి ఆమె మనసును పాడుచెయ్యలేదు.

"ఆ పిల్ల...అతడి కూతురు కాదుట!"

"అవును- కూతురని వీరు చెప్పారా? అన్న కూతురట."

"ఊహూం... నీ కింతేనా తెలిసింది? అన్న కూతురూ కాదుట! వీరితో ఏమో- అసలు ఈయనకి అన్నలేలేరు. ఒక్క అన్నలే ఏమిటి. ఎవ్వరూ లేరుట."

"అందుకేనేమో ఆడింది ఆట, పాడింది పాటగా వున్నారు. పెళ్ళి లేదు..."

"ఇంకా పెళ్ళెందుకు? పేటాకులు? ఇంట్లో వయసొచ్చినపిల్ల వుండనే వుంది."

"అందుకే చేసుకోలేదేమో. అయినా బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముది



రినా అని... ఇంకా పెళ్ళేమిటి ? అయినా పిల నెవరిస్తారట..."

"పోనీ... ఇంకా ఏ పిల్లో ఎందుకు... దాన్నే కట్టుకుంటే సరిపోతుందిగా ?"

తేళ్ళు జరిచినట్లయింది కృష్ణకి ! ఈ మాటలు... తనని... గురించే ! తను ఇంట్లో లేడనుకుని... ఛీ...ఛీ! అంతులేని ఆవేశం కలిగింది. గబుక్కునలేచి బయటకు వచ్చాడు.

అమ్మలక్కలు ఎక్కడి వాళ్ళక్కడ తప్పుకున్నారు

ఆ రోజల్లా చిత్రవధ ననుభవించాడు కృష్ణ ! ఛీ పాడులోకం- నోరే గానీ కళ్ళు లేని లోకం ! మంచికి చోటు లేదా? నీతికి స్థానం లేదా? న్యాయం అన్నదే లేదా? తమ రిద్దరిదీ ఎంత పవిత్రమైన బంధం! తండ్రీ కూతుళ్ళకంటే... అన్నా చెల్లెళ్ళ కంటే- అన్నిటి కంటే- అన్ని ప్రేమలకంటే- ఉన్నతమైనది! అది- అది ఎవ్వరికీ అర్థం కాదు- ఎవ్వరూ తెలీదు అర్థం చేసుకోలేరు. మనసులో ఎంతో బాధ ననుభవిస్తూనే వున్నాడు. చివరికి శిల్పకు త్వరలో వివాహం చెయ్యాలనే నిర్ణయానికి వచ్చాడు కృష్ణ.

"ఏమిటి బాబాయ్ ఆలోచన ? చీకటి పడింది వెళ్దామా ?"

శిల్ప మాటలకి ఈ లోకంలోకి వచ్చాడు.

"వెళదాంగాని అమ్మా చూడు నువ్వీ సంగతి బాగా ఆలోచించు తల్లీ సరేనా ?"

"సరేలే" నవ్వింది శిల్ప.

# రాగరేఖలు

లేచారిద్దరూ.

కిలకిలనవ్వుతూ మాట్లాడుతూనే వుంది శిల్ప. కృష్ణ మౌనంగా వున్నాడు.

భోజనాలయ్యాక మళ్ళీ ఆ ప్రసక్తి తెచ్చాడు కృష్ణ

"అబ్బ బాబాయ్ మీరు అదేపనిగా ఆ సంగతి ఆలోచించకండి-ఒక ఏడాది పాటన్నా నేను ఉద్యోగం చెయ్యాలి" కుర్చీలో కూర్చుని కాళ్ళాడిస్తూ అంది శిల్ప

## 2

"బాబాయ్ బాబాయ్" పరుగెత్తుకుని ఎదురొచ్చింది శిల్ప. అప్పుడే కాలేజీనించి వచ్చాడు కృష్ణ. "ఏమిటమ్మా ఏమిటా కంగారు ?"

"నాకు ఇంటర్వ్యూ వచ్చింది. బాంక్ ఉద్యోగానికి అప్లై చేశానుగా. కానరా బాంక్‌కి- దానికి ఇంటర్వ్యూ వచ్చింది బాబాయ్" అన్నది గబగబా.

"ఇంటర్వ్యూకే ఇంత సంతోషపడి పోతున్నావు. ఇంక ఉద్యోగం వస్తే... నేనే కనబడనేమో" నవ్వాడు కృష్ణ.

"పోండి బాబాయ్- మీకంతా ఎగతాళే" అంటూ లోపలికి వెళ్ళింది శిల్ప కాఫీ తేవడానికి.

కాఫీ తాగుతూ శిల్పనే చూస్తున్నాడు కృష్ణ.

'ఇప్పుడే వస్తానం'టూ లోపలికి వెళ్ళి ఇంటర్వ్యూ లెటరు- తన ఎంబ్రాయిడరీ సామగ్రి తెచ్చుకుంది.

ఇంటర్వ్యూ లెటరు కృష్ణకిచ్చి అతడి ఎదురుగా కూర్చుంది ఎంబ్రాయిడరీ సామగ్రితో. లేత నీలిరంగు కర్టెన్ క్లాత్ అది. దానిమీద అందమైన క్రాస్‌స్టిచ్ డిజైను కుడతోంది శిల్ప ఏపనైనా సులువుగా నేర్చేసుకుంటుంది ఆమె. క్షణం ఊరికే కూచోదు.

పరీక్ష లవంగానే కుట్లూ, అల్లికలూ నేర్చుకుంది. కృష్ణకి, తనకీ స్వెట్టర్లు అల్లింది.

టేబిల్ క్లాత్‌మీద- పిల్లో కవర్ మీదా అందమైన ఎంబ్రాయిడరీ వర్క్ చేసింది. రకరకాల బ్యాగ్‌లు అల్లింది వైర్‌తో.

"సరేగాని శిల్పా, ఉద్యోగం ఇంకే పూర్లోనో వస్తే ఏం చేస్తావు?"

"వెళ్దామనే అనుకుంటున్నాను బాబాయ్ నా చదువంతా ఇక్కడే సాగింది. కొన్నాళ్ళు ఉద్యోగరీత్యా నన్నా వేరే వూళ్ళో వుండాలని వుంది" అంది తల పైకెత్తి శిల్ప.

కృష్ణ మొహంలో ఒక బాధా వీచిక క్షణం వీచి మాయమైంది.

అది గమనించింది శిల్ప చటుక్కున ఆమె కళ్ళల్లో గూడా నీటిపొర కదలాడింది.

కృష్ణ కంట పడిందది.

ఎవరికి వారే కంగారు పడ్డారు.

"ఏమ్మా ఏమిటది- ఎందుకు?"

"ఏమిట బాబాయ్"

ఇద్దరూ ఒకేసారి అన్నారు. మళ్ళీ ఇద్దరూ నవ్వుకున్నారు. అదేమిటో ఇద్దరికీ తెలుసు! ఇరవై సంవత్సరాలుగా అల్లుకుపోయిన అనుబంధం అది!

చేతిలోవున్న ఇంటర్వ్యూ కార్డువైపు చూశాడు కృష్ణ.

ఎం. ఏ. పాసైన శిల్పకు ఆఫీసరు పోస్టుకి వచ్చిన ఇంటర్వ్యూ లెటరు అది !

* * *

ఇంటర్వ్యూలో సెలక్టయింది శిల్ప. బెంగుళూరులో ఇక కొక పదిరోజుల్లో జాయిన్ కావాలి. మొదటకొన్నాళ్ళు ట్రైనింగ్ వుంటుంది. తర్వాత రెగ్యులర్ పోస్టింగ్ వస్తుంది. చాలా సంతోషంగా వుంది శిల్పకి మరోవైపు బాధగానూ వుంది- కృష్ణని విడిచి వెళ్ళాలని !

కృష్ణ బెంగుళూరు లోని తన స్నేహి



# ట్రూ నిర్వహించే అత్యద్భుత పోటీ!



## ఆకర్షణీయమైన బహుమతులు గెలుపొందండి!

ఆకర్షణీయమైన అతిసులభమైన ఈపోటీలో పాల్గొనండి! మీరేవిజేతగా బహుమతి నందుకోగలరేమో, ఎవరికి తెలుసు? మరువకండి ఇది అతిసులభమైన పోటీ.

**ఒకటి-మొదటి బహుమతి-విజయ్‌స్కూటర్**
**ఒకటి-రెండవ బహుమతి-రూ. 2,500/-లు విలువజేసే మద్రాస్ శారదాస్‌వారి బట్టలు**

**మరియు, విజేత మద్రాస్ నివాసికాని పక్షంలో మద్రాస్ వచ్చుటకు విమానంద్వారా కాక ఫస్ట్‌క్లాస్ రైలుప్రయాణంద్వారావచ్చి వెళ్ళుటకు ఇద్దరికి అవకాశము. మూడు-మూడవ బహుమతి-ఓనిడ ఎలక్ట్రానిక్ రిస్ట్‌వాచీలు. కన్సొలేషన్ బహుమతులు-20 యు.ఎమ్.ఎస్ కేల్‌క్యులేటర్స్. బహుమతులు స్వీకరించుటకు యిష్టపడనివారికి నగదు రూపంలో యివ్వబడును.**

పోటీలో పాల్గొనే విధానము:

"మాండే ఎంపిక"లో పతకాలను పొందిన ట్రూ బిస్కెట్స్ యొక్క ప్రతిఉత్పత్తి ఈదిగువ "ఎ. బి." అనే బొమ్మలుగా ఇవ్వబడినవి. దిగువచూపబడిన నమూనాలో చూపబడినవిధంగా రెండు బొమ్మలకు మధ్య 6 విధాలుగా తేడాలను "బి" బొమ్మమీద మార్క్ చేయండి.









A









B

యూరప్‌లో మాండేఎంపికలో ట్రూబిస్కెట్స్‌వారు తమ ప్రతిఉత్పత్తితో పతకాలను ఎందుకు గెల్చుకున్నారో అనేదానిపై ఈ క్రిందినివ్వబడిన ఖాళీలో పదిహేను మాటలు మించని ఒక స్లోగన్ వ్రాయండి.

స్లోగన్: ______________________

______________________

______________________

దిగువనీయబడిన ఖాళీలనునింపి ఈప్రకటనలోని ఎంట్రీని కత్తిరించి ఈ క్రింది చిరునామాకు పంపండి.

పేరు: ______________________

చిరునామా: ______________________

**పంపవలసిన చిరునామా**

ట్రూ బిస్కెట్ కాంటెస్ట్, ఆరోఫుడ్ ప్రైవేట్ లిమిటెడ్,
ఆరోవిల్లి 605 101 (వయా) పాండిచ్చేరి.



నిబంధనలు-నియమావళి:

1) భారతదేశంలోవుంటున్న ప్రతి ఒక్కరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ఆరోఫుడ్ ప్రైవేట్ లిమిటెడ్‌కు చెందిన ఉద్యోగస్థులు, వారి ప్రచారపు ఏజంట్లు మెస్సర్ హిందుస్థాన్ థాంప్సన్ కుటుంబ ఉద్యోగులు పోటీలో పాల్గొనుటకు అనర్హులు.
2) మీరు ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చు అయితే ప్రతి ఎంట్రీతోపాటు ట్రూ బిస్కెట్‌వారి ఉత్పత్తులకు చెందిన ఏ రేపర్‌నయినా ఒక దానిని జతపర్చవలెను.
3) మీరు పంపిన ఎంట్రీలకు సంబంధించిన తని వర్గములు అంతను వగైరాలన్నీ ఆరోఫుడ్ ప్రాడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారికి మాత్రము చెందుతాయి. సకాలానికిచేరని మిస్ అయిన ఎంట్రీలకు మేము ఎలాంటి బాధ్యులం కాము.
4) తపాలా ఆలస్యంకాగపోయిన, మిస్ అయిన ఎంట్రీలకు మేము ఎలాంటి బాధ్యులంకాము. పూర్తిచేసిన ఎంట్రీలు 5 జూన్ 79 తేదికిగాని అంతకు ముందుగానయినా చేరాలి.
5) ఉత్తమ ఎంట్రీని ఎంపిక చేయుటలో న్యాయ మూర్తులదే తుదినిర్ణయము. ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశంలేదు.
6) విజేతలకు పోస్టుద్వారాగాని, పత్రికలద్వారాగాని తెలియ జేయబడును.

ప్రధానాంశము

ట్రూ బిస్కెట్స్‌వారి ఉత్పత్తులకు చెందిన ఏఒక్క రేపర్ అయినను తప్పనిసరిగా ఎంట్రీఫారంతో జతపర్చివంపాలి. నియమావళి నిబంధనలు సక్రమముగాపాటించి మెరిట్ చూపిన ఎంట్రీలకు పూర్తిన్యాయంజరుగును.

పూర్తిచేయబడిన ఎంట్రీఫారంలు 5-6-1979లోగా ఆరోఫుడ్ ప్రైవేట్ లిమిటెడ్ వారి కార్యాలయము చేరవలయును.

ట్రూ బిస్కెట్లు అమ్మే ఏషాపులోనైనా ఎంట్రీఫారంలు లభించును. మరియు ఈ ప్రకటనను ఎంట్రీఫారముగా ఉపయోగించవచ్చును.

**TRUE బిస్కెట్స్**

టుంటే — ఒకళ్ళిద్దరికి ఉత్తరాలు రాశాడు శిల్ప విషయం. ఇళ్ళు అదీ చూసి కొంత సహాయం చెయ్యమని. శిల్పకెన్నో విషయాలు చెప్తున్నాడు కృష్ణ, పెద్ద పిటీల్లో ఆడపిల్లల జాగర్త గురించి చెప్పాడు. ఒంటరిగా వుండడం అంటే మరీ జాగ్రత్త అవసరం అని చెప్పాడు.

శిల్పకి లోపల కొంత భయంగానే వుంది. తను ఒంటరిగా ఎప్పుడూ వుండలేదు బుద్ధి తెలిసిన తరువాత. తన భయం పైకి కనబరిస్తే కృష్ణ తన ప్రయాణాన్ని మానేయమంటాడు. ఉద్యోగమే వదిలేయ మంటాడు. అందుకే పైకి గంభీరంగా — ధైర్యంగా వుండిపోయింది.

కావలసినవన్నీ కొనుక్కుంది. బట్టలన్నీ సర్దుకుంది. ప్రయాణానికి సన్నద్ధమయింది.

ఆరోజే ప్రయాణం. కృష్ణ కూడా ఆమె వెంట బయల్దేరాడు. ఒంటరిగా పంపించడం ఇష్టంలేక. ఇల్లు అదీ చూసి కొంత ఆమె సర్దుకున్నాక తిరిగి వచ్చెయ్యొచ్చని కాలేజీకి నాలుగు రోజులు సెలవు పెట్టాడు.

# రాగ రేఖలు

సికింద్రాబాద్ బెంగుళూరు ఎక్స్ ప్రెస్‌లో ఎక్కారు. రైలు బయల్దేరింది. ఏదో పర ధ్యానంగా ఆలోచిస్తున్నాడు కృష్ణ.

"బాబాయ్. అటు చూడండి ఆ వచ్చేది ఆంటీ కదూ? చిత్రా ఆంటీ!" అంది శిల్ప.

కృష్ణ చూశాడు. ఎవరితోనో మాట్లా డుతూ గబగబా నడిచి రైలు వెంట వస్తోం దామె. ఆ పక్క కంపార్ట్‌మెంట్‌లోనే ఆమెకి కావల్సినవాళ్ళెవరో వున్నట్లున్నారు— రైలు వేగం అందుకుంది. ఆమె రైలుతో సమానంగా నడవలేక వెనకబడింది. చెయ్యి వూపుతోంది. క్రమ క్రమంగా దూర మయింది. తనని గమనించలేదు ఆమె! చివరిగామె కనిపించడం కూడా లేదు. రైలు ముందుకి వెళ్తోంది ప్లాట్‌ఫారం దాటింది!

దీర్ఘంగా నిట్టూర్చాడు కృష్ణ.

చిత్ర... ఇప్పుడే వుంది కాబోలు! చిత్ర ఒకప్పుడు తన ప్రాణంలో ప్రాణం! తనకి ఆత్మీయురాలు. ఆప్త మిత్రురాలు. తన... తన... ప్రియురాలు ఒకప్పుడు! ఛీ...ఛీ... ఇప్పుడా మాట కూడా అనుకోకూడదు. ఇప్పుడామె తనకేమీ కాదు. ఆమె మరొకరి దయిపోయింది. తన జ్ఞాపకాలకి— తన మధుర స్మృతులకి— తెర పడిపోయింది!

కాని ఆ తెర తొలగిస్తే ?! ఇరవై ఏళ్ళ క్రిందటి సంఘటనలు ఇప్పుడు జరిగినట్లుగా వుంటాయి!

## 3

"ఎవరు రామయ్యా ఆ అమ్మాయి?" కాలేజి కెళ్ళబోతూ గేటు దగ్గిర రామయ్య ఎవరితోనో మాట్లాడడం చూసి అడిగాడు కృష్ణ.

"మన ఎదురింట్లో వుంటారు బాబూ. ఆ అమ్మాయి వాళ్ళ అమ్మాయిట! గుంటూ ర్నించి వచ్చింది అక్కడే వాళ్ళ తాతగా రింట్లో వుండి చదువుకుంటోందిట! మన తోట బావుందిట— చూడ్డానికి వచ్చింది. ఇంట్లో ఎవరెవరు వుంటారని అడిగితే... చెప్తున్నాను." రామయ్య మాటలు విన్నాక తను తోటని మరోకసారి తృప్తిగా చూసు కున్నాడు కృష్ణ.

" అందమైన అమ్మాయిని ఆకర్షించింది తమ తోట! తమ తోటకేం.. గులాబీలు విరగబూసి వున్నాయి. నీలియగాలు, నేరి యాలు రంగు రంగుల కాంతుల్ని వెదజల్లు తున్నాయి!

రకరకాల క్రోటన్సు ఆకులతో అవ్వే విస్తున్నాయి! లిల్లీలు, మెట్టతామరలు, మందారాలు, రాంబాణాలు, అన్నీ కళ్ళకి విందు చేస్తున్నాయి.

గరుడవర్ధని, నందివర్ధనం, గన్నేరు, పారిజాతం, ఒకటేమిటి తమ తోటలో లేనివి వున్నాయా? బంతులు, చేమంతులు, సన్న జాజులూ, అన్నీ వున్నాయి.

రోజూ కొంతసేపు తోటపని చేస్తేగాని తోచదు కృష్ణకి.

ఆ తరువాత రెండుమూడురోజులు తను కాలేజీ నించి వచ్చేవేళకు ఆ అమ్మాయి వెళ్తూ కనిపించేది.

రామయ్యతో చక్కగా కబుర్లు చెప్పేది. ఆ అమ్మాయి తనవేపు కన్నెత్తైనా చూసేది కాదు. తల వంచుకుని వెళ్ళిపోయేది.

ఆమెకు తమ తోటంటే చాలా ఇష్టం కలిగిందనీ, పూలమొక్కలంటే చాలా ఇష్టమనీ చెప్పాడు రామయ్య.

ఆమె పేరు మాత్రం చెప్పలేకపోయాడు రామయ్య. ఎంత ప్రయత్నించినా ఆమె ముఖం కనబడలేదు కృష్ణకి.

ఒత్తయిన తలకట్టు, నాజూకైన విగ్రహం, తియ్యని కంఠం, నడకలో వయ్యారం. ఇవి గమనించాడు కృష్ణ. ఒకటికి రెండుసార్లు చూడాలనిపించేది. ఆమె ముఖాన్ని పరిశీలనగా చూడాలనీ— ఆమెతో పరిచయం చేసుకోవాలనీ— రామయ్యతో చెప్పేటట్టు తనతోనూ ఆమె కబుర్లు చెప్పాలనీ— ఏవేవో కోరికలు కలగసాగాయి అతడిలో! తనకి ఎం. ఎస్. సి. పరీక్షలు దగ్గిర కొస్తున్నాయి. ఈ ఆలోచనలతో అప్పుడప్పుడు తన చదువు కొనసాగేదికాదు. తనతో మాట్లాడని ఆ పిల్ల రామయ్యతో అన్నాళ్ళు కబుర్లు చెప్తుంటే కొంచెం ఈర్ష్య కూడా కలిగింది.

ఆ తరువాత వారం రోజులకి కృష్ణ ధైర్యం చేసి కొన్ని గులాబీ పూలు కోసి రామయ్య కిచ్చి వాళ్ళింటికి పంపించి తను కాలేజికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం అతడూహించినట్లే ఆ అమ్మాయి తన తోటలోనే వుంది. తనని చూడగానే వెళ్ళిపోలేదు. తన కోసమే వెయిట్ చేస్తున్నట్లుగా తలెత్తి చిరునవ్వు నవ్వింది ముత్యాల జల్లు కురిసింది తన ముంగిట కొండెక్కినంత సంబరపడి పోయాడు తను.

"చాలా థాంక్సండీ!" అంది వీణ మీటి నట్లు.

తనతో మాట్లాడింది ఆ అమ్మాయి తనతో మాట్లాడింది! సంతోషంతో ఉక్కిరిబిక్కిరయిపోయాడు! అదంతా పైకి కనబడనకుండా "ఫరవాలేదండీ! దాంట్లో ఏముంది? మా యింట్లో పూలు పెట్టుకోవడానికి ఎవరూ లేరు..." అన్నాడు ఆమె తల్లో మరింత అందాన్నిచ్చిన తమ తోట గులాబీలను చూస్తూ.

"రండి లోపల కూర్చుందాం" అన్నాడు మళ్ళీ తనే.

"ఉహూ! లేదండీ— నేను వెళ్ళాలి." వెళ్ళబోయింది.

ఆ అమ్మాయి వెళ్ళకూడదనీ, తనతో ఇంకా ఏవో కబుర్లు చెప్పాలనీ, అనిపిస్తూ వున్నా కృష్ణ ఏమీ చెయ్యలేక పోయాడు.

"ఒక్క నిముషం" అన్నాడు ఆత్రంగా.

ఆమె ఆగింది.

"మీరు రోజూ మీకు కావలసిన పూలు కోసుకోవచ్చు"

కళ్ళతో నవ్వింది ఆమె.

"చాలా థాంక్స్" అంది మళ్ళీ.

క్షణం ఆగి "వెళ్తానండి" అని వెళ్ళిపోయింది. ఎంత అందం!

తన జన్మలో చూడలేదు అంత అందం! చంద్రబింబం లాంటి ముఖం, ఆహా—అదీ బాగా లేదు. ఆమె ముఖాన్ని దేనితోనూ పోల్చలేదు. కళ్ళు, ముక్కు, నోరు అన్నీ అన్నిట్లోనూ లావణ్యమే!

వెన్నెలలోని తెల్లదనం—చల్లదనం,
పూవులలోని మకరందం—సుగంధం,
పిల్లగాలిలోని పలకరింత—పులకరింత,
కోయిలపాటలోని మాధుర్యం—కమ్మదనం,

అన్నిటినీ కలగలిపి — ఆమెని తయారు చేశాడు దేవుడు. అద్భుత సౌందర్యం! ఒక్కసారి చూస్తే జన్మాంతం గుర్తుండే సౌందర్యం ఆమెది! పేరేమిటో? పేరేమిటో? రాత్రిళ్ళు నిద్రకూడా లేకుండా ఇవే ఆలోచనలు కృష్ణకి ఆ తరువాత నాలుగురోజులు— ఆమెని చూడడానికి వీలుపడలేదు కృష్ణకి.

పరీక్షల హడావిడిలో పడిపోయాడు కాని, ఆమెని ఆమె సౌందర్యాన్ని మాత్రం మరవలేదు. పరీక్షలయ్యాయి. హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు ఆ తరువాత అంతా ఖాళీనే కాబట్టి రోజూ తోటలోనుండి ఆ అమ్మాయి కోసం నిరీక్షించాడు.

ఆమె రాలేదు.

ఉండబట్టలేక రామయ్యను అడిగాడు. ఆమె ఊరెళ్ళిపోయి వారమయిందని చెప్పాడు రామయ్య.

నిరాశపడిపోయాడు కృష్ణ.

(ఇంకా వుంది)



# వారఫలం

25-5-1979 శుక్రవారం మొదలు
31-5-1979 గురువారం వరకు

**మేషం :** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**వృషభం :** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. సంతోషకరమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం :** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**కర్కాటకం :** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం మధ్యలో అధిక వ్యయం చేస్తారు. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. నూతన అవకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. కార్యాలు నెరవేరతాయి.

**కన్య :** మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**తుల :** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం బాగుంటుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**వృశ్చికం :** ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో అనుకూలమైన సమాచారాలు వస్తాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు :** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో సాటివారిలో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మకరం :** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కుంభం :** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. స్త్రీలకు :— బంధు మిత్రులను కలుసుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :** రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొహమాటాలు తగవు. బంధువులను సహాయం చేస్తారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది, సంతోషకరమైన సమాచారం అందగలదు.

— మహేష ●

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥ల గా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ , అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ , మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

OBM-5709A/1 TEL


అర్ధరాత్రి
పిలిచే వ్యక్తి


గోపాల్ మరియు మయ రెండు నెలల క్రితం వివాహం చేసుకున్నారు. గోపాల్ టూర్‌లో బయటకు వెళ్లాడు.
నేను చాల వదులుకున్నాను. ఈ ఇంట్లో ఒంటరిగా ఉండటానికి చాలా అసహ్యమేస్తుంది.


ఆయన ఇంటికి వచ్చా దనుకుంటాను...నేను చాల బాధపడ్డాను...
ఆ రాత్రి తుపాను చెలరేగింది. వర్షం కురవడం మొదలైంది.


అకస్మికమైన కాలింగ్ బెల్లు శబ్దం మయను నిద్రనుంచి మేల్కొల్పింది
ఈ రాత్రి సమయంలో అతనెవరై ఉంటారు? క్రొత్త వ్యక్తికి తలుపు నెలా తెరవడం?


మయకు క్రొత్త ఐడియా తట్టింది. ఆమె టార్చిని పట్టుకుని కిటికీలోకి కాంతిని చూపెట్టింది.
ఓ మీరా! నేను చాలా భయపడ్డాను, నేను తలుపు తెరుద్దామని వస్తున్నాను.
నేనే! తొందరగా తెరువు వర్షంలో తడుస్తున్నాను.


నేను చాలా గర్వ పడుతున్నాను భయ పడాల్సిన అవసరం లేదని సూచించే నమ్మకమైన టార్చి ఉన్నందుకు.
నేను తొందరగావచ్చి ఆశ్చర్యంతో ముంచేద్దామనుకున్నాను.
భయపడాల్సిన అవసరం లేదని మయకు సూచించిన టార్చి. ఎవరెడి అరిస్టోక్రాట్—ఎవరెడి వారి నమ్మకమైన 27 టార్చిలలో ఒకటి




OBM-6070A 8 TEL




UNION CARBIDE

సీరియల్

# ఇది ఒక పాంథశాల

శ్యామల

*(గత సంచిక తరువాయి)*

ఔరంగాబాదులో అన్ని అంతస్థుల వాళ్ళకి సరిపడే హోటళ్ళు చాలానే ఉన్నాయి. హోటల్ రూంలో దిగాక, స్నానాలు ముగించి టిఫిన్లు తీసుకున్నాక విశ్రాంతిగా పడుకున్నారు. సాయంకాలం అట్లా వూరిలో కాసేపు తిరిగివచ్చి, మర్నాడు ఎల్లోరా వెళ్ళటానికి బస్ టిక్కెట్లు బుక్ చేసుకున్నారు.

భోజనం చేస్తూనే పడుకుంది సంధ్య. కుర్చీలో కూర్చొని న్యూస్ పేపర్ తిరగేస్తున్నాడు విజయ్

"అప్పుడే ఏంనిద్ర సంధ్యా?" అన్నాడు.

"నిన్న రాత్రంతా రైల్లో నిద్ర సరిగా లేదేమో, నిద్ర వస్తోంది" అంది సంధ్య.

"మధ్యాహ్నమంతా నిద్ర పోయావు కదటోయ్?"

"ఇప్పుడు నేను నిద్రపోతే మీ కెందుకు బాధ? మీరూ పడుకోండి హాయిగా!" అనేసి గోడవైపు తిరిగి కళ్ళు మూసుకుంది.

పేపరు చదవటం అయిపోయింది. మామూలుగా నిద్ర ప్రైవేం కాలేదేమో, నిద్ర రావటం లేదు ఏమీ తోచటం లేదు.

"సంధ్యా" పిలిచాడు

సంధ్య పలకలేదు. నిద్ర నటిస్తున్నది. కళ్ళు ఇంకా గట్టిగా మూసేస్కుంది.

అది చూసి నవ్వుకుంటూ "సంధ్యా, బోర్ కొడుతోంది లేవవూ?" అన్నాడు.

సంధ్య వింటి జవాబు లేదు.

ఓ నిమిషం ఆగి,

"అబ్బా!" చేతనయినంత బాధగా అన్నాడు.

టక్కున లేచికూర్చుంది. "ఏమయింది?" కాస్త ఆత్రంగా అడిగింది.

"తల నెప్పి" కణతలు రుద్దుకుంటూ అన్నాడు.

"ఇప్పు డెలాగ? ఏమీ టాబ్లెట్లు కూడా లేవు!"

"హుఁ!" మూలిగాడు మళ్ళీ.

"అయ్యో, బాగా ఎక్కువగా ఉన్నట్లుందే! ఏం చేయటం?" బాధగా అంది.

"ఏం చేస్తావు నీవుమాత్రం? పడుకోలే, నాబాధ నేను పడతాను."

"మీకింత నెప్పిగా వుంటే నాకు నిద్ర పడుతుందా? ముందు మీరు పడుకోండి."

అతను పడుకున్నాక ప్రక్కనే కూర్చుని నుదురు ఒత్తసాగింది.

చటుక్కున ఆమె నడుం మీద చేయేసి దగ్గరకు లాక్కున్నాడు. ఉలిక్కిపడి లే[illegible] బోయింది. లేవనీయకుండా చేయి అడ్డు[illegible] పెట్టాడు.

కోపంగా ఏదో అనబోయింది. అత[illegible] పెదిమలు అడ్డు వచ్చాయి.

విలాగో లేచి కూర్చుని "అన్నీ దొంగ వేషాలు! నిజమేననుకొని మంచి నిద్ర పాడు చేసుకొని లేచాను!" కోపంగా అన్నదేకాని కళ్ళు నవ్వుతున్నాయి.

"ఏంచేయను రాణీ, మర్యాదగా లేపితే లేవలేదు!" అమాయకంగా ముఖం పెట్టి అన్నాడు.



"మళ్ళీ ప్రొద్దున్నే లేవాలి ... యింక పడుకోండి." నవ్వుతెప్పున్నట్లు అంది.

"ఓ పాట పాడు, నిద్ర వస్తుందేమో చూస్తాను."

లైటు ఆర్పేసి వచ్చి కూర్చుంది. అట్టే బతిమలాడించుకోకుండానే "ఎంకిపాట" మొదలు పెట్టింది.

"ఆరిపోయవే దీపము..."

పాట పూర్తయీ అవకుండానే విజయ్ కౌగిలిలో వుంది సంధ్య. ఆ మధురిమలో కరిగి పోయింది మిగిలిన రాత్రి.

* * *

"ఈ మారుమూల గుహలలోకి వచ్చి శిల్పాలు చెక్కుతూ జీవితాలే గడిపేశారు. మహనీయులైన కొందరు బౌద్ధ బిక్షువులు' వివరిస్తున్నాడు గైడ్.

"ఏ శక్తి వాళ్ళను ప్రేరేపించిందో, జీవితంలో సుఖాలన్నీ వదిలేసుకుని వచ్చి ఇలా గడపటానికి!" అంది సంధ్య.

"ఆదర్శంకోసం జీవితం బలిపెట్టడం మరీ అసాధారణమేం కాదు .. బుద్ధుడే భార్యాబిడ్డలను వదిలి 'మహాభినిష్క్రమణం' చేయలేదూ? యువరాజు -- సర్వసంపదలూ అతని పాదాల వద్ద పడివున్నాయి - మహా సౌందర్యవతి, సుగుణవతి అయిన భార్య యశోధర వుంది -- ముద్దులు మూటగట్టే కొడుకు రాహులుడు -- ఆయనకేం తక్కువ? అన్నీ విడిచిపెట్టి, కాషాయవస్త్రాలు ధరించి అడవులు పట్టిపోయాడు. ఎందుకు? ఏదో తెలుసుకోవాలనే తపన. ఏదో చేయాలనే ఆరాటం...తోటి మనుష్యుల దుఃఖం పోగొట్టాలనే ఆదర్శం అంతకుమించిన త్యాగం, ఔన్నత్యం ఎక్కడయినా వుండగలదా అనిపిస్తుంది", అన్నాడు విజయ్.

"నామటుకు నాకు సిద్ధార్థుడి మీద గౌరవం కంటే యశోధరపట్ల జాలి ఎక్కువ కలుగుతుంది. అల్లారుముద్దుగా పెరిగింది అపురూపంగా భర్త ప్రేమించింది అందాలుచిందే బాబుకి జన్మనిచ్చింది .. హాయిగా నిద్రపోతున్నది- నిశ్చింతగా! తెల్లవారేసరికి భర్త -- తన ప్రాణాధికమైన ప్రభువు -- మాయమయినాడు తనను, బిడ్డను వదిలేసి వెళ్ళిపోయాడు ఆమె దుఃఖం ఊహించటంకూడా కావటంలేదు! తిరిగి కన్పించింది ఏళ్ళు పూళ్ళూ గడిచినాకే! అప్పుడయినా కాషాయవస్త్రాలలో సన్యాసిగానే! స్త్రీకి ఇంతకుమించిన విపత్తు ఏం వుంటుంది? ఆయన కనబడినపుడు పాదాలపైన వ్రాలి అడిగిందట ఆమె --

'సర్వమానవ జాతిపట్ల ప్రేమ పొంగగా, వారి బాధలు తొలగించటానికి ఏదయినా చేయాలనే తపనతో, ముక్తిత్రోవలోకి నడిచివెళ్ళావు స్వామీ! కావాలనుకున్నావు, వెళ్ళావు -- బాగానే వుంది! ఇంతటి మానవజాతిమీదే నీకు ప్రేమ కలిగిందికాని, నీ భార్యపట్ల నిన్నే నమ్ముకున్న నీ సహచరణిపట్ల ప్రేమ కలగలేదా? యశోధర జీవితం దుఃఖభాజనమవుతుందేమోననే ఆలోచనే నీకు తోచలేదా? ఇదేం న్యాయం?'

"మీరు పురుషులు కనుక ఆ బాధని అర్థంచేసుకోలేరు విజయ్! గౌతముని త్యాగాన్ని హర్షిస్తాను...ఆయనని విపరీతంగా గౌరవిస్తాను... కాని నా సానుభూతి వర్షించేది యశోధరపైన! నా ప్రేమ ప్రవహించేది యశోధరవైపుకే! భర్త వదిలేస్తే యశోధర జీవచ్ఛవంలాసయినా బతికింది. నేనే అయితే ప్రాణత్యాగమే చేస్తానేమో!" ఆవేశంతో కన్నీళ్ళు తిరిగాయి సంధ్యకి.

"ఇంత సెన్సిటివ్‌గా వుండకూడదు సంధ్యా! మనం వచ్చింది హనీమూన్‌కి, సరదాగా గడపాలి... పద, అటు వెళ్ళి చూద్దాం--" నడుంమీద చేయివేసి తీసుకువెళ్ళాడు.

తన కన్నీళ్ళకు తనే సిగ్గుపడింది సంధ్య. తలెత్తి అతనివైపు చూసి చిన్నగా నవ్వింది.

"ఇంద్రధనస్సులాగా వుంది నీ ముఖం." అన్నాడు

"అదేం పోలిక ?"

"ఎండావాన కలిసినపుడేకదా రెయిన్‌బో వచ్చేది! నవ్వు, ఏడుపు కలిసివుండేసరికి నీ ముఖంలో--"

అతన్నేచూస్తూ మనోహరంగా మళ్ళీనవ్వింది

* * *

అజంతాలో ఒకచోట 'కిసాగోతమి' చిత్రం - చనిపోయిన కొడుకుని ఒడిలో పెట్టుకొని బుద్ధభగవానుని చెంత విలపిస్తున్న దృశ్యం కనిపించింది.

"ఈ కథ తెలుసా నీకు ?" అడిగాడు విజయ్ తెలియదన్నట్లు తల త్రిప్పింది సంధ్య

"గోతమి అనే స్త్రీకి ఒక్కడే కొడుకు. అయిదారేళ్ళవాడు. ఒకరోజు ఆటల్లోవుండగా ఆ బాలుడికి పాము కరిచి మరణించాడు.

ఆ తల్లి దుఃఖానికి అంతులేదు. ఆ మృత బాలుడిని తీసుకొని ఊరికి అవల శిష్యులతో కూడి కూర్చొనివున్న బుద్ధభగవానుడి వద్దకు వెళ్ళింది.

"స్వామీ, నా బిడ్డని బ్రతికించు!"

"అలాగే, గోతమీ. కాసిని ఆవగింజలు తీసుకువస్తావా? బ్రతికిస్తాను ... అం. చూడు, దుఃఖం అనేది ఎన్నడూ అనుభవించని ఇంటినించి తీసుకురావాలి ఆవాలు"

గోతమి తిరిగి ఊర్లోకి వెళ్ళింది. ఇంటింటా అడిగింది "మీ ఇంట్లో ఎప్పుడయినా దుఃఖం వుండినదా ?" ఎన్ని ఇళ్ళు తిరిగినా దుఃఖంలేని ఇల్లే కనబడలేదు. బాధలులేని జీవితాలే అగుపడలేదు. ఒక ఇంట్లో రోగాలు, ఒక ఇంట్లో మరణాలు, ఒక ఇంట్లో ఆకలి, ఒక ఇంట్లో పోట్లాట -- ప్రతిచోటా ఏదో ఒక కష్టం!

గోతమి తిరిగి తథాగతుని వద్దకు వెళ్ళింది. "అర్థమయింది స్వామీ! మానవ జీవితంలో మరణం తప్పదు; దుఃఖం తప్పదు."

"గోతమీ, దుఃఖం తప్పదుకదా అని దుఃఖిస్తూ వుండిపోకు. దుఃఖం తప్పదుకదా అని మొండిగా ధైర్యం తెచ్చుకోవటానికి ప్రయత్నించకు. కళ్ళుతెరిచి, చుట్టూ వున్నవారి బాధలు గుర్తించు! అందరినీ ప్రేమించు! జీవితం తాత్కాలికమైనదని అర్థంచేసుకొని, తోటివారి సుఖ, దుఃఖాలే నీ సుఖ, దుఃఖాలుగా భావిస్తే అదే చాలు!"

సంధ్య మౌనంగా కథ విన్నది.

"ఓ చోట చదివాను సంధ్యా -- గుప్పెడు శాంతిబీజాలు దొరికితే చాలు. ప్రపంచమంతా సంతోషవుపంట పండించవచ్చు. కాని అవి దొరికేది ఎట్లా? ప్రతి మనిషి మనసులోనూ ఏదో అశాంతి, ప్రతి ఇంటా ఏవో చికాకులు; ప్రతి దేశానికి ఏవో సమస్యలు! ఎవరినీ ద్వేషించనివాడు, కోరికలను జయించినవాడు ఎక్కడయినా వుంటే అతనికి దుఃఖమనేది వుండదు -- నిజమే! కాని ఆవిధంగా వుండటం అసంభవంకదా -- ఎలా దొరుకుతాయి గుప్పెడు శాంతిబీజాలు!? స్వాభిమానం మంచిదేకాని, దురభిమానం మంచిదికాదు ... ప్రతి మనిషికీ నేను ప్రక్కవాడికంటే గొప్పవాడిననే ఫీలింగ్ -- వ్యానిటీ అంటారనుకుంటా -- ఇంక శాంతిబీజాలు ఎలా దొరుకుతాయి? ఈ కక్షలు, కావేషాలు -- మనిషికీ, మనిషికీ మధ్యనున్న గోడలు -- దేశానికీ, దేశానికీ నడుమ జరిగే యుద్ధాలు -- వీటికి అంతెక్కడ ? ప్చ్..."

"ఇన్ని తెలిసిన మీరు ఆర్మీలో చేర్దామని ఎలా అనుకున్నారు ?"

"మనిషి ప్రవృత్తి ఈవిధంగా వున్నంతకాలం యుద్ధాలు తప్పవు సంధ్యా! మొదటి ప్రపంచ యుద్ధం వలన దేశాలు నేర్చుకున్నదేమిటి? రెండవప్రపంచయుద్ధం మరింతమారణహోమంతో జరిగింది! ఇండియాకి, పాకిస్తాన్‌కి అభిప్రాయ భేదాలు; రష్యాకి, అమెరికాకి నడుమ విభేదాలు; ఇజ్రాయిల్‌కి, అరబ్ దేశాలకి తగాదాలు -- ఇవన్నీ ఇలావుండగా, 'ఇంకెలాగో వుంటే బాగుండును' అనుకొని కళ్ళు మూసుకోవడంవలన ఒరిగేదేం వుండదు! నేను ఎయిర్‌ఫోర్స్‌లోకి వెళ్దామనుకున్నది యుద్ధమంటే మోజువలన కాదు; నిన్ను సుఖపెట్టటానికి డబ్బు కావాలి సంధ్యా దానికోసం!"

"ఇంతగా ఆలోచించే మీకు సుఖసంతోషాలకు డబ్బుతో నిమిత్తంలేదని తెలియకపోయిందా?"

"అట్లాగనకు! డబ్బుకి కల విలువని ఎవరూ కాదనలేరు. డబ్బున్నంత మాత్రాన సంతోషం కొనుక్కోలేము నిజమే, కాని సుఖాల్ని కొనుక్కోగలం. సుఖంగా వున్నప్పుడు సంతోషంగా వుండగలిగే అవకాశాలు ఎక్కువ -- అయినా డబ్బొకటే కాదు, మరో కారణంకూడా వుంది."

***జరిగిన కథ - 3 :*** అక్క నిర్మల, బావ రవిల సంరక్షణలో ఉంటున్న సంధ్యకు 'అట్వా'లో ఉద్యోగం రాగా విజయ్‌కి తనకు జరిగిన వివాహ పూర్వాపరాలు గుర్తుకువస్తాయి నిర్మలను చూడటానికి వచ్చినపుడే మనసులు కలిసి రిజిష్టరు మేరేజి చేసుకున్న విజయ్, సంధ్యల జీవితం సాఫీగా సాగుతుండగా, విజయ్ మిలటరీలో ఉద్యోగానికి లోగడే దరఖాస్తు చేసాడని తెలుసుకొని విస్తుపోతుంది సంధ్య. విజయ్ స్నేహితుడు రవిలో నిర్మలకు పరిచయ మౌతుంది

''ఏమిటో ?''

''నేను ఇప్పుడు ఆఫీసులో చేస్తున్నది పూర్తిగా డెస్క్ వర్క్. అది నా స్వభావానికి సరిపడదు. నేను ఇంజనీరుని విపరీతంగా పెరిగిపోతున్న శాస్త్ర పరిజ్ఞానం యింకా నేర్చుకుంటూ, దాన్ని ఉపయోగిస్తూ యంత్రాల మధ్య పని చేయటం నాకు సరదా! అటువంటి జాబ్ నాకు తృప్తినిస్తుంది. ఎయిర్‌ఫోర్స్‌లో అటువంటి జాబ్ శాటిస్‌ఫాక్షన్ వుండే అవకాశా లెక్కువ అని విన్నాను నేను వేయాలనుకున్నది గ్రౌండ్ ఇంజనీర్‌గా ... కాని ఇంటర్వ్యూకి పిలుపే రాలేదు ... ఎందుకొచ్చిన ఈ డిస్కషన్ ?''

ఇద్దరూ ముందుకు కదిలారు బొమ్మలు చూసుకుంటూ

## 5

వారంరోజులు ఉల్లాసంగా గడిపాక తిరిగి హైదరాబాదు వచ్చేశారు. సంధ్యకి పరీక్షలు మూడు నెలలలోకి వచ్చాయి సినిమాలు, షికార్లు ఆపేసి, కష్టపడి చదవసాగింది. ప్రిపరేషను హాలిడేస్‌లో పుట్టింటికి వెళ్ళిపోయింది, సమయాన్నంతా చదువుకే వెచ్చించాలనే ఆశతో రోజూ సాయంత్రం వచ్చి కాస్సేపు కూర్చుని కబుర్లాడి, ఒక్కోమారు భోజనంచేసి, వెళ్ళేవాడు విజయ్

ఆఖరు పరీక్ష వ్రాసి వచ్చింది సంధ్య వస్తూనే, 'అమ్మయ్య' అని పుస్తకాలు సోఫాలోకి గిరవాటువేసింది

''పరీక్షలపైన కోపమంతా నాపైన చూపిస్తే ఎట్లా ?'' అన్నాడు సోఫాలో కూర్చుని వున్న విజయ్, పుస్తకాలు తగలకుండా ప్రక్కకి జరుగుతూ

'అయ్యో సారీ, మిమ్మల్ని చూడనేలేదండీ!'' నొచ్చుకుంటూ వచ్చి ప్రక్కనే కూలబడింది ''ఎంత రిలీఫ్‌గా వుందో ఈరోజు !''

అంతలో తల్లి కాఫీ తీసుకువచ్చింది ''బాగా రాశావా సంధ్యా ?'' అని అడిగింది

''బాగానే వ్రాశానమ్మా !''

''ఏం పరీక్షలో తల్లీ—నువ్వు, నిర్మలా ఇద్దరూ బాగా చిక్కిపోయారు! దానికింకా ఓ వారం పడుతుంది పూర్తయేసరికి ''

కాస్సేపు మాట్లాడి లోనికి వెళ్ళిందావిడ.

''చూశావా ఎలా పాలిపోయావో ?'' అన్నాడు విజయ్ సంధ్య ముఖంలోకి చూస్తూ

రాత్రి భోజనాలవగానే తమ యింటికి వెళ్దామంది సంధ్య.

తను చిక్కిపోయి, పాలిపోయిన మాట నిజమే కాని పరీక్షలు కాదు, వేరే కారణం ఉంది సంధ్య అదేమిటో గ్రహించింది. కాని రూఢి అయినాకే ఇతరులకు చెప్పాలనుకుంది

ఆ రాత్రి రేడియోలో బాలసరస్వతి కమ్మని స్వరంతో పాడుతున్నది

''బంగారు పాపాయి బహుమతులు పొందాలి
పాపాయి చదవాలి మా మంచి చదువు —''

ఆ పాటంటే విజయ్‌కి చాలా యిష్టం తన్మయత్వంతో కళ్ళు మూసుకుని వింటున్నాడు

చిన్నగా అక్కడికి వచ్చింది సంధ్య రేడియో స్వరం తగ్గించి, ఆపైన పాట తనే పాడసాగింది

''మా పాప పలికితే మధువులే కురియాలి
మా పాప పాడితే పాములే ఆడాలి —''

కళ్ళు తెరిచాడు విజయ్ ఆకుపచ్చని ముస్తాలితో వనకన్యలాగా కనిపించింది సంధ్య –

''నువ్వే ఆ బంగారు పాపవి!'' అంటూ ఒళ్ళోకి లాక్కున్నాడు

''నేను కాదు... ఇంకో పాప !''

''ఇంకో పాపా ? ఎక్కడుంది ?''

''ఇక్కడే !''

''ఏదీ ?'' అర్థంకాలేదు విజయ్‌కి

సంధ్య వివరించకుండా చిన్నగానవ్వి, రేడియో వాల్యూమ్ పెంచింది

బాలసరస్వతిదే మరో పాట వస్తున్నది -

''మా ముద్దు కృష్ణయ్య లీలలు
మంజుల మధు మురళీలీలలు''

విజయ్‌కి అర్థమయిపోయింది.

''సంధ్యా !'' సంభ్రమంగా అన్నాడు. ''ఎంత తీయటివార్త !'' ఇక ఆపైన ఆనందోద్వేగంలో ఏం మాట్లాడలేకపోయాడు. భార్యని నుదుటమీద, కళ్ళమీద, చెక్కిళ్ళమీద ఎన్నిసార్లు ఎన్ని ముద్దులు పెట్టుకున్నాడో – తనివితీరటంలేదు !

తల వెనక్కి వాల్చి కిలకిలా నవ్వింది సంధ్య. రేడియోలో మరొక పాట వస్తున్నది —

''సిరిమల్లె పూవల్లే నవ్వు
చిన్నారిపాపల్లే నవ్వు —''

సంధ్య నవ్వులో శృతి కలుపుతూ తనూ నవ్వాడు విజయ్.

నిజానికి తాము ఎందుకు నవ్వుతున్నారనేది వాళ్ళకీ తెలియదు. సంతోషంగా ఉన్నారు – కనక నవ్వుతున్నారు – అంతే ! అట్లా హాయిగా నవ్వగల గటమూ ఓ అపురూపమైన వరమే ! ఓ అదృష్టమే !

* * *

ఇంకా విజయ్ ఆఫీసు నుంచి రాలేదు. టిఫిన్ చేస్తుంటే తలుపు చప్పుడయింది వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా రవి !

''గుడ్‌మార్నింగ్'' అన్నాడు రవి.

''వెరీ గుడ్‌మార్నింగ్ ! కూర్చోండి విజయ్ ఇంకా రాలేదు. వచ్చే వేళయింది'' అని చెప్పి లోనికి వెళ్ళి కాఫీ, టిఫిన్ తీసుకువచ్చింది

అతను ఏదో తీవ్రాలోచనలో వున్నాడు మాట్లాడకుండా పకోడీలు నములుతూ కూర్చున్నాడు. సంధ్య అడిగినవాటికి ఏదో పొడిగా జవాబులిచ్చాడు.

ఏమిటిలా మూడ్‌గా వున్నాడనుకొంది సంధ్య.

ఉన్నట్లుండి అన్నాడు రవి, ''మీకు యిది చూపిద్దామని వచ్చాను సంధ్యా !'' జేబులోంచి ఓ చిన్న కాగితంపొట్లం జాగ్రత్తగా తీశాడు

ఆశ్చర్యంగా చూస్తున్నది సంధ్య

తెల్లని కాగితంలో మరో ఎర్రని ఉలిపిరి కాగితం – దానిలో ఒక్క ముత్యం పొదిగిన అందమైన ఉంగరం

అది ఆడపిల్లలు పెట్టుకునే నాజూకయిన ఉంగరం

''నిర్మలకోసం కొన్నాను'' అన్నాడు.

''నిర్మలకోసమా ? !'' మరింత ఆశ్చర్యంగా అడిగింది

''తను పెళ్ళికి ఒప్పుకుంటే, నాచేత్తోనే తొడగాలని—''

''ఒప్పుకుందా ?''

''నేనడగలేదు సంధ్యా ! నాతో యెంతో స్నేహంగా వుంటుంది చక్కగా కబుర్లు చెప్తుంది ... నేనూ అంతే ... కాని పెళ్ళి మాట అడగాలంటే ధైర్యం చాలదు .. తను కాదంటే భరించలేను.''

చిన్నగా నవ్వింది సంధ్య ''అయితే మరి ఉంగరం దేనికి కొన్నట్లు ?''

''పూర్తిగా వినండి మరి నిన్న మధ్యాహ్నం



# ముద్దు బిడ్డ మొదటి ఘన ఆహారం. ఇందులో సులభంగా జీర్ణమయ్యే బియ్యం, పుష్టికరమైన 11 విటమినులు, మరియు యినుము కలసివున్నాయి

# నెస్టమ్

## బిడ్డలకై తయారు చేయబడిన బియ్యపు సారం.

మీ ముద్దు బిడ్డకు ఘన రూపమైన ఆహారం పెట్టడం ప్రారంభించారంటే, ఆ బిడ్డకు మంచి పుష్టినిచ్చే ఆహారం యివ్వండి అంతేకాదు, ఆ ఆహారం అతి సున్నితమైన ఆ బిడ్డ జీర్ణావయవముల మీద తేలికగా పనిచేసేదిగా కూడా వుండాలి సులంభంగా జీర్ణమయ్యే ధాన్య ఆహారం బియ్యమేనని డాక్టర్లు అంగీకరించారు అందుచేతనే మేము బియ్యంతో నెస్టమ్ క్రీమ్ తయారు చేశాము ఇందులో మీ బిడ్డ ఆరోగ్యంగా పెరుగుటకు ముఖ్యంగా అవసరమైన విటమినులు, ఇనుము తగినంత పాళ్లలో చేరియున్నది

మీ ముద్దు బిడ్డకు 3 నెలలు నిండగానే యీ ఆహారం యివ్వడం ప్రారంభించవచ్చు బిడ్డ పెరిగే కొద్దీ, యీ ఆహారానికి పండ్లు, కాయగూరలు, పప్పు, కలిపి, క్రొత్త క్రొత్త రుచులు చవి చూపించవచ్చు మెల్ల మెల్లగా.







గరిష్ఠ ధర
రు. 7-00
స్థానిక పన్నులు
అదనం.

**పూర్తి పోషక పదార్థములతో సులభంగా జీర్ణమగు నిండు ఆహారాన్ని తయారు చేయుటకై దీనిని పాలతో కలపండి.**


ముందుగా కాచియుంచిన పాలను వంచుకోండి.


దానికి నెస్టమ్ కలపండి.


వెంటనే యిచ్చుటకు తయారు




SAA/FSL/N/1134

సినిమాహాల్లో ఇంటర్వెల్‌లో కనిపించింది. ఒక్కర్తే వచ్చిందట, నేను ప్రక్కనే కూర్చుని కబుర్లు చెప్తున్నాను. అప్పుడు తన జడలోంచి రాలి క్రిందపడింది ఇది—'' జేబులోనించి మరొక పొట్లం తీశాడు. అందులో వాడిపోయిన గులాబిపువ్వు వుంది ''నేను ఆ పూవుని అందించ బోయాను. స్వీట్‌గా నవ్వుతూ ''కావాలంటే మీరే వుంచుకోండి'' అంది దానిలో నాలో ఏదో ధైర్యం కలిగింది. పెళ్ళి మాట అయితే అడగలేక పోయాను. కాని, ఈ ఉంగరం కొన్నాను!''

ఫకాలున నవ్వొచ్చింది సంధ్యకి కాని నవ్వితే ఇన్సల్ట్ ఫీలవుతాడేమోననిపించి, అతికష్టంమీద ఆపుకుంది. ముఖాన్ని సీరియస్‌గా వుంచాలని ప్రయత్నిస్తూ అంది ''తీసుకువెళ్ళి ఆ ఉంగరం ఆమెకు ఇవ్వకపోయారా? మీ మనసు తెలును కునేది''

''గుడ్ అయిడియా! అలానే యిస్తాను సంధ్యా! ఉంగరంతోపాటు ఓ చీటీ కూడా పెట్టనా? ఏం రాస్తే బాగుంటుంది?'' కాగితం, పెన్ చేతిలోకి తీసుకుంటూ అడిగాడు

''విత్ బెస్ట్ విషెస్, రవి'' అని రాయండి ఐడియా యిచ్చింది.

''అంతేనా?'' నిరుత్సాహంగా అన్నాడు.

''పోనీ, 'ప్రేమతో, రవి' అని రాయండి.'' అతనికి అదీ నచ్చలేదు కాస్సేపు ఆలోచించి, 'ఇచ్చావు నాకొక గులాబిని

అందుకో ఈ చిన్న కానుక' అని రాస్తే ఎలా వుంటుంది?

ఇంక ఆపుకోలేక ఫకాలున నవ్వేసింది సంధ్య వింతగా చూశాడు రవి ''ఇందులో నవ్వేందు కేమున్నది?''

''సారీ, రవీ, నవ్వినందుకు ఏమీ అనుకోవద్దు! అయినా మీరు అటువంటి కవిత్వం రాస్తే నిర్మలకు కూడా నవ్వు వస్తుంది, నిజం!''

''అయితే, అట్లా రాయనులెండి'' మరికాసేపు ఆలోచించాడు ''ఈ ఉంగరంలోని ముత్యంలాగా నా ప్రేమ కూడా స్వచ్ఛమయినది అని రాయనా''

మళ్ళీ నవ్వాలనిపించింది సంధ్యకి

''మామూలుగా వెళ్ళి, 'నిర్మలా, నిన్ను పెళ్ళి చేసుకోవాలనివుంది ఏమంటావు?' అని అడిగేయండి సరేనంటే ఉంగరం యివ్వండి కాదంటే ఇవ్వకుండా వచ్చేయండి కాదన్నాక అందుకు అనవసరపు ఖర్చు?''

''సంధ్యా! సంధ్యా! నిర్మల అపురూపమైన పిల్ల! తన గురించి ఇంత సాదాగా యెలా మాట్లాడగలుగుతున్నారు మీరు?''

''దేవతాకాదు, దయ్యమూకాదు మామూలు మనిషే! నేను తన చెల్లెలినే కదా నాకు తెలియదా?''

'పెళ్ళి మాట నేను డైరెక్ట్‌గా అడగలేను సంధ్యా!'' నిస్సహాయంగా అన్నాడు

''పోనీ! నేనడగనా?''

''ఏమని అడుగుతారు?'' ఆత్రంగా న్నాడు

''అక్కా, రవిగారని గురించి నీ అభిప్రాయం

# ఇది ఒక పాంథశాల

ఏమిటి అని గుంభనగా అడుగుతాను, మీ మనసులోని ప్రేమ విషయం చెప్పకుండా. సరేనా?''

''తను ఏమన్నదీ ఫ్రాంక్‌గా చెప్పేయాలి.''

''ఓకే''

పొట్లాలు రెండూ అతిపదిలంగా తిరిగి జేబులో పెట్టుకున్నాడు

''ఆ ఎండిపోయిన పువ్వు కూడా ఎందుకండీ, దాచుకోవటం?'' నవ్వుతూ అడగకుండా ఉండలేక పోయింది సంధ్య.

''అది 'ఎండిపోయిన పువ్వా?' ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నారు? అది నా ప్రేమ పుష్పం... నా రాణి తలలో ఒకప్పుడు ఉన్నది.. నాకు అత్యంత విలువైన వస్తువు... అది చూస్తూ కూర్చోవటమే నేను తీరికదొరికినప్పుడల్లా చేసే పని...''

''యూ ఆర్ సిల్లీ!'' అందామనిపించింది సంధ్యకి. కాని అనలేదు అప్పుడే వచ్చాడు విజయ్

''హలో రవీ!'' అని మిత్రుడిని పలకరించి ''ఇంకా రెడీ కాలేదా?'' అన్నాడు సంధ్యతో

''రెడీకావటమా? దేనికి?'' అని ప్రశ్నిస్తుండ గానే, సడన్‌గా గుర్తువచ్చింది సంధ్యకి. విజయ్‌కి ఇటీవలనె ఒక ఎయిర్‌ఫోర్స్‌లోని వ్యక్తితో పరిచయ మయింది. విజయ్ ఆర్మీ లైఫ్ గురించి తెలుసు కోవాలనే కుతూహలం వ్యక్తపరిస్తే, ఆయన విజయ్‌ని భార్యతో కలిసి తమ ఇంటికి ఈ రోజు సాయంత్రం రమ్మని ఆహ్వానించాడు.

నిన్న విజయ్ ఈ విషయం చెప్పినపుడు అయిష్టంగా చూసింది సంధ్య.

''మీకెందుకు ఆర్మీ అంటే ఈ మోజు?'' అంది ముఖం చిట్లించి.

''అతని ఇంటికి వెళ్ళినంత మాత్రాన ఆర్మీలో జాయిన్ అవుతున్నట్టుకాదు సంధ్యా! ఓ కామన్ ఫ్రెండ్ ఆఫీసులో పరిచయం చేశాడు స్నేహంగా అతను ఆహ్వానించాడు. నేను సరేనన్నాను అంతే!''

''ఇలాంటివాళ్ళతో పరిచయాలయినకొద్దీ ఎయిర్‌ఫోర్స్‌లోకి వెళ్ళాలనే కోరిక మీకు ఎక్కువ అవుతుంది. నాకు ఇష్టంలేదు'' స్పష్టంగా చెప్పేసింది.

కొంచెం చిన్నబుచ్చుకున్నట్లయింది అతని ముఖం ''నిన్ను అడగకుండా మనిద్దరం వస్తామని మాట యివ్వటం నాదే తప్పు ఈ ఒక్కసారికీ దయచేసి వచ్చి, నా గౌరవం కాపాడు'' అనేసి అవతలకి వెళ్ళిపోయాడు.

సంధ్యకి బాధనిపించింది స్వతహాగా విజయ్ చాలా శాంతస్వభావుడు కోపం రావటమనేది చాలా అరుదు. ఎప్పుడూ సర్దుకుపోవటం అతని పద్ధతి అటువంటి వ్యక్తి యిలా నిష్ఠూరంగా మాట్లాడాడు! అయినా తనేమన్నదనీ? అతనికి చేస్తున్న ఉద్యోగం మానేసి ఆర్మీలోకి వెళ్ళాలని కోరిక వుంది తనకు అది యిష్టంలేదనడం తప్పా?

పెళ్ళయినాక తామిద్దరిమధ్య సరదాకు చేసుకునే వాగ్వివాదాలు తప్ప కీచులాటలనేవి దాదాపుగా లేదనేచెప్పాలి అందువలననే అతని మాటలకు సంధ్య మనసుకి కష్టంతోచింది అతను తిరిగి గదిలోకి రావటం చూసి గబగబ కన్నీళ్ళు తుడిచేసుకుంది

ఈరోజు ఉదయం అమ్మ వచ్చి మధ్యాహ్నం వరకు కూర్చొని వెళ్ళింది. అమ్మ వెళ్ళగానే ఇంటి పనులు చూసుకుంటుండగా రవి వచ్చాడు. అతనితో కబుర్లలో తను ఈ సాయంత్రం ప్రోగ్రాం విషయమే మరిచిపోయింది నిజానికి తను విజయ్‌తో కలిసివెళ్ళాలనే అనుకుంది. కాని మరిచి పోయానంటే అతను నమ్ముతాడా? ఇష్టంలేక, కావాలనే సిద్ధం కాలేదనుకుంటాడు.

''ఇప్పుడే అయిదు నిమిషాల్లో సిద్ధమవుతాను'' చిన్నగా అనేసి లోనికివెళ్ళింది.

''నేను వెళ్తాను విజయ్, చాలాసేపయింది వచ్చి'' అని రవి వెళ్ళిపోవటం వినిపించింది

సోపుతో ముఖం కడుక్కొని వచ్చి తుడుచు కుంటున్నది సంధ్య. తలుపువేసి వచ్చాడు విజయ్.

''నా మాటమీద నీకు గౌరవం ఉందని భ్రమపడ్డాను సంధ్యా! ఇష్టంలేని చోటుకు రమ్మనటం నాదే తప్పు అయామ్ సారీ! ఫోన్ చేసి రాలేకపోతున్నామని చెప్పేస్తాను.'' అని వెళ్ళిపోయాడు, సంధ్యచెప్తున్నా వినిపించుకోకుండా

వీధి చివరనున్న షాపుకి వెళ్ళి 'అనివార్య కారణాల వలన రాలేకపోతున్నామని, మరోరోజు వస్తామని' ఆ కొత్త మిత్రుడికి చెప్పివచ్చాడు.

కుర్చీలో కూర్చుని పేపరు చేతిలోనికి తీసుకున్నాడు

కాఫీ, టిఫిన్ తీసుకువచ్చింది సంధ్య.

కొద్దిగా చప్పుడుచేస్తూ టేబుల్‌పైన వుంచింది. అతను తలెత్తి అయినా చూడలేదు

అలాగే నిల్చుంది సంధ్య కాస్సేపు. తర్వాత, ''సరదాగా ఫ్రెండ్ యింటికి వెళ్దామంటే, ఇష్టంలేదని పట్టుబట్టే మూర్ఖురాలినికాను విజయ్. నేను నిజంగానే మరిచిపోయాను క్షమించండి'' అంది ఖిన్నవదనంతో

పూర్తిగా న్యూస్‌పేపర్‌లో నిమగ్నమయినట్టు వుండిపోయాడు విజయ్

ఓ నిమిషం సమాధానంకోసం ఎదురుచూస్తూ నిల్చుంది తర్వాత వస్తున్న ఏడుపు దిగమింగు కుంటూ కిచెన్‌లోకి వెళ్ళిపోయింది వంటచేసి తిరిగి వచ్చేసరికి, విజయ్ రేడియో వింటూ కూర్చునివున్నాడు టేబుల్‌పైన చప్పగా చల్లారి పోయిన కాఫీ, టిఫిన్ అలాగే వున్నాయి

చటుక్కున బెడ్‌రూంలోనికి వెళ్ళిపోయింది.

విసుగ్గా రేడియో ఆపేసి, బట్టలు మార్చుకోవటానికి బెడ్‌రూంలో అడుగుపెట్టిన విజయ్‌కి పరుపుమీద బోర్లాపడుకొని దిండులో తలదూర్చుకొని ఏడుస్తున్న సంధ్య కనిపించింది

అంతవరకు అతనికి కలిగిన కోపమంతా చప్పున ఎగిరిపోయింది!

ఛ, తను ఒట్టి ఫూల్! ఎన్నడూలేనిది ఎందుకిలా కోపం తెచ్చుకున్నాడు? మరచిపోయానని చెప్పి, క్షమించమని అన్నదికదా, అయినా బాధ పెట్టాడు! పశ్చాత్తాపమనిపించింది

ప్రక్కనే కూర్చుని నడుము చుట్టూ

# పాపం, దీనికి అమ్మా నాన్నా లేరు, మనం పెంచుకుందామా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే
## ***రీగల్*** కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం అందుకు రీగల్ మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు
'రీగల్ కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను,
వెలుగుతోను మెరిసేలా చేస్తుంది లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది
'రీగల్ ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే రీగల్ మీకు ఎంతో పొదుపుచేస్తుంది
'రీగల్ ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి




Rediffusion D/767e/TL/R

చేయివేస్తూ, "సంధ్యా" అని పిలిచాడు మృదువుగా

పట్టుక్కున తలెత్తింది సంధ్య ముఖమంతా కన్నీళ్ళతో, జాలికొలిపేటట్లు ఉంది "నామీద కోపం వద్దు విజయ్, నేను భరించలేను" అంటూ అతని ఒళ్ళో ముఖం దాచేసుకుంది ఎక్కిళ్ళు వస్తూనే ఉన్నాయి

"సంధ్యా, ప్లీజ్, ఏడవకు ఇందాక కోపగించు

## ఇది ఒక పాంథశాల

కున్న మాట నిజమే కాని ఇప్పుడేం కోపంలేదు! ప్లీజ్, ఊరుకోమ్మా! బాధపెట్టినందుకు నీవే నన్ను క్షమించాలి నువ్వేడుస్తుంటే నేను చూడలేను ఊఁ, ఏదీ లేచి కూర్చో"

అతనికి కోపం లేదనేసరికి సంధ్య మనసుకి కాస్త హాయనిపించింది వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చేసరికి అతను కంచాలు పెట్టి, అన్నం వడ్డించాడు భోజనాలు పూర్తయేసరికి ఇద్దరూ మామూలుగా అయిపోయారు కాని అసలు సమస్య అలాగే ఉంది — అతనికి ఆర్మీలో చేరాలని కోరిక ఆమెకు అది యిష్టంలేదు!

[ఇంకా వుంది

# సినిమా విశేషాలు

## "క్రాంతి" అంటే

"క్రాంతి" అనే పదానికి అర్థం చెప్పుకోవాల్సి వస్తే, "విప్లవం" అనే చెప్తాం. కానీ విప్లవం అంటే బస్సులు తగలపెట్టడం, రైళ్ళు పడగొట్టడం మాత్రం కాదు. ఆగ్రహావేశాలతో జరిపే అనాలోచిత కార్యాలకు మారు పేరే "విప్లవం" (విధ్వంసం). ఈ విప్లవం — అదే ఈ విధ్వంసంవల్ల ప్రయోజనం ఏమిటి? సాధించేదేమిటి? అని ఒక్కసారి ఆలోచిస్తే, "ఏమీలేదు" అనే సమాధానమే ఎదురౌతుంది. మరి ప్రజల అవసరాలను, హక్కులను ప్రభుత్వానికి తెలియచేసేదెలా? అందుకు మార్గం ఏమిటి? అని కొందరడిగే ప్రశ్నకు, "తీవ్రపోరాటం చేస్తేగానీ ప్రజల ఆరాటం ప్రభుత్వానికి తెలుస్తుందనుకోవడం పొరబాటు. శాంతియుత పోరాటంవల్ల కూడా సాధించలేనిదంటూ ఏదీ లేదు" అని సమాధానం చెప్పొచ్చు. మహాత్మాగాంధీ మన దేశానికి స్వాతంత్ర్యాన్ని తీసుకొచ్చిందెలా? "క్రాంతి" ద్వారానే. కానీ "శాంతి" మార్గంలో. జపాన్ దేశంలో కూడా కార్మికులు సమ్మెలు చేస్తారు. ఎలా? "క్రాంతి" ద్వారానే. కానీ శాంతిమార్గంలో తాము సమ్మె చేస్తున్నట్టు అధికారవర్గానికి తెలిసేందుకు నల్ల సంకేతాలను ధరించి మరీ పని చేస్తారేగానీ, పని మానరు. వాళ్ళ "క్రాంతి"లో శాంతి కన్పిస్తుంది కనుకనే వారికి "కాంతి" లభిస్తుంది. మానవాభ్యుదయానికి "క్రాంతి" కావాలి, శాంతి కావాలి. కానీ దానికి మార్గం ఏమిటి? అనే ప్రశ్నకు సమీక్షాంశమే దర్శక, కథకుడు శ్రీ ముంజులూరి భీమేశ్వరరావు "క్రాంతి" చిత్రం.

మహేష్‌కౌల్ లాంటి ప్రముఖ దర్శకుల వద్ద పని చేసిన శ్రీ ముంజులూరి భీమేశ్వరరావును గూర్చి కొన్ని నిజాలను చెబితే కొందరు అతిశయోక్తి అనుకోవచ్చు. కానీ ప్రతిభవున్న ఒక వ్యక్తిని గూర్చి పదుగురికి తెలియచేయడం తప్పుకాదని నా అభిప్రాయం. ఒక చిత్రానికి "ట్రీట్‌మెంట్" వెన్నెముకలాంటిది. "ట్రీట్‌మెంట్" బాగుంటే చిత్రాలు విజయవంతంకావడానికి ఎక్కువగా అవకాశం వుంటుంది. అలాంటి "ట్రీట్‌మెంట్" వ్రాయడంలో భీమేశ్వరరావు ఘటికుడు. ఇటీవలె తన మొదటి తెలుగు చిత్రం "క్రాంతి" రషస్‌ను చూపించారు భీమేశ్వరరావు కొంతమంది క్రిటిక్స్‌కు. దాదాపు 20 వేల అడుగుల రషస్‌ను టపీగా చూచి, "చక్కటి థీమ్‌కు చిక్కటి ట్రీట్‌మెంట్ ఇచ్చి, "క్రాంతి"ని అందంగా మలచిన తీరు అభినందనీయం. ప్రయోజనం గల ఈ ప్రయత్నానికి ప్రజల ఆశీర్వాదం తప్పకుండా లభిస్తుంది" అన్నారు.

"క్రాంతి" చిత్రంలో భ్రాంతి కలిగించే విషయాలు చాలా వున్నాయి. శ్రీమతి జయంతి తెలుగులో తొలిసారిగా ద్విపాత్రాభినయం చేసిన చిత్రమే "క్రాంతి". మొన్న మొన్నటివరకూ పరిశ్రమకు, ప్రజకు బేబీ బ్రహ్మాజీగా పరిచయమైన ఆ అమ్మాయి, "క్రాంతి" చిత్రంలో కుమారి బ్రహ్మాజీగా మారడం విశేషం. "క్రాంతి" చిత్రంలో ఒక ముఖ్య భూమికకని ఎన్నుకోబడ్డ కుమారి సత్యచిత్ర ఆ చిత్రం షూటింగ్ జరుగుతున్న సమయంలోనే "గాలివాన" చిత్రంలో హీరోయిన్ పాత్రకు ఎన్నుకోబడడం మరొక విశేషం.

"క్రాంతి" చిత్రం షూటింగ్‌ను ముందు, అన్నవరం, హంసవరం ప్రాంతాలలో జరపాలనుకున్నాము. కానీ షూటింగ్‌కు రెండురోజులు ముందు లొకేషన్ మార్చడం జరిగింది. "కోలంక"లో షూటింగ్‌ను జరపడానికి నిర్ణయించాము. ఫిబ్రవరి-17న ఉదయం 9 గంటలకు యూనిట్ అంతా పూజకోసం రెడీ అయింది. కానీ షూటింగ్‌కు అతిముఖ్యమైన కెమెరా అంతవరకూ రాలేదు. ఏం చేయాలో బోధపడక అప్‌సెట్ అయిపోయివున్నారు అందరూ. మా అదృష్టం బాగుండబట్టేమో ప్రసాద్ ప్రొడక్షన్స్ ఆనందబాబుగారు అప్పటికప్పుడు (ముందురోజు రాత్రి) స్పెషల్ వాన్ ఒకటిచ్చి, ఉదయం 11 గంటకంతా లొకేషన్‌కు కెమెరా చేరేలా చేసారు. మాలాంటి చిన్ననిర్మాతల, దర్శకుల చిత్రాలకు అంత పెద్ద సంస్థ సమయానికి సాయపడకుండావుండివుంటే మొదటిరోజే ఎంత అవమానం జరిగుండేది? మా అవసరాన్ని గుర్తించి, మాకు సాయపడ్డ శ్రీ ఆనందబాబు, వారి యూనిట్‌కు మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము. అలా షూటింగ్ తొలిరోజే 'క్రాంతి'" అన్నారు దర్శక, కథకుడు భీమేశ్వరరావు.

"ప్రముఖ నటుడు శ్రీ హరనాథ్ తమ్ముడు "క్రాంతి" చిత్రంలో ఒక ముఖ్య భూమికకు ఎన్నికయ్యాడు. దాదాపు సగం చిత్రానికి పైగా నటించాడు. ఒకరోజు షూటింగ్ జరుగుతుండగా వున్నట్టుండి క్రిందపడిపోయాడు. ఏమిటో ఏమో అనే కంగారు అందరికీ. వెంటనే డాక్టరు దగ్గరికి పంపించాము. మధ్యలోనే సుబ్బరాజు మమ్మల్నిందర్నీ దుఃఖసాగరంలో ముంచి మరో లోకానికి వెళ్లిపోయాడు. అతని ఆత్మశాంతికోసం మూడురోజులు షూటింగ్‌ను కాన్సిల్ చేసాము. మా "క్రాంతి" చిత్రం చివరిరోజు షూటింగ్‌ను సుబ్బరాజుగారి స్వగ్రామమైన "పిఠాపురం"లో వారి స్వగ్రామంలో షూట్‌చేసి, అతని ఆత్మకు కొంత ఉపశాంతి కల్గించాము. "క్రాంతి" చిత్రాన్ని అతనికి అంకితం చేయాలని నిర్ణయించుకున్నాము. గుండెపోటువల్ల మరణించిన మిత్రుడు శ్రీ సుబ్బరాజుకి ఇంతకుమించి ఏమీ చేయలేకపోయినందుకు బాధపడుతున్నాము" అన్నారు శ్రీ భీమేశ్వరరావు.

శ్రీ ఊటుకూరి వెంకటనారాయణ సమర్పించు ఈ "క్రాంతి" చిత్రంలో జయంతి, రంగనాథ్, శ్రీరాం, విజయభాస్కర్, కృష్ణమోహన్, భాస్కరరాజు, హేమసుందర్, యం. పి. ప్రసాద్, సత్యచిత్ర, కుమారి బ్రహ్మాజీ, సుకన్య (కాకినాడ), పిఠాపురం పద్మ ముఖ్య పాత్రధారులు. శ్రీ చల్లా ఈశ్వరయ్య, శ్రీ కె. యు. యస్. భాస్కరరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి ఆత్రేయ, సముద్రాల, మహదేవన్, యోగానంద్, ఆత్మ సాంకేతికసారధులు.

'కొత్త అల్లుడు'లో కృష్ణ, జయప్రద





**ప్రజానాయకుని ఆశీర్వాదం**

తమిళ రాజకీయరంగంలో ప్రముఖ వ్యక్తిగా విరాజిల్లుతున్న శ్రీ కోవై చెరియన్ శ్రీ ఎన్టీఆర్... శ్రీ డి. ఎన్. ఆర్. కలయికలో ఓ అపురూపమైన వర్ణ చిత్రాన్ని తలపెట్టారు.

ఏప్రిల్ 29న కె. సి. సౌండ్ జరిపిన తొలి పాట రికార్డింగుకు ... తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. జి. రామచంద్రన్ విచ్చేసి ... తన ఆశీస్సుల నందజేశారు.

శ్రీ దాసరి చిత్రీకరణలో సెప్టెంబరు నుంచి సెట్స్‌కు వెళ్ళే శ్రీ కోవై చెరియన్ చిత్రానికి ఆర్. కె. ధర్మరాజా ... మహదేవన్ ... సి. ఎల్. రాయ్ ముఖ్య సాంకేతిక సారధులు

శ్రీ ఎన్టీఆర్ ... శ్రీ దాసరి కలయికలో మరో హిట్ చిత్రాన్ని ఈ కలం ఆశిస్తూంది.

ఇంతవరకు శ్రీ ఎన్టీఆర్ ధరించని కొత్తతరహా పాత్రను ... ప్రేక్షకులు చూస్తారని... అగ్రదర్శకుడు శ్రీ దాసరి చెప్పారు.

**ఎన్టీఆర్ చిత్రాలు ....**

**దర్శకులు .... నాయికలు**

"సూపర్‌స్టార్" శ్రీ ఎన్టీఆర్ ఈ సంవత్సరంలో ఏడు కొత్త చిత్రాలను అంగీకరించారు. ఆ చిత్రాలను నిర్మించే వ్యక్తులు ... చిత్రీకరించే దర్శకులు...ఆయన సరసన నటిస్తున్న నాయికలు ఎవరో పాఠకులకు తెలియాలిగా.

రోజా మూవీస్ ... రాఘవేంద్రరావు, శ్రీదేవి. నవశక్తి పిక్చర్స్ ... రమేష్, రాధాసలూజా. అనిల్ ప్రొడక్షన్స్ ... టి. ఎల్. వి. ప్రసాద్, జయప్రద. లక్ష్మి విష్ణు ప్రొడక్షన్స్ ... వి. మధుసూదనరావు, జయప్రద. కె. సి. సెలింస్ ... దాసరి నారాయణ రావు, జయప్రద. వెంకటేశ్వర క్రియేషన్స్ ... తాతినేని రామారావు, జయప్రద. గజలక్ష్మి చిత్ర... కె. ఎస్. ఆర్. దాస్, లత. డైరెక్టర్ శంకర్‌గారి చిత్రం : శంకర్, లత.

**అగ్రనటి పేరు మారింది**

అగ్రనటిగా ఆంధ్రుల ఆదరాభిమానాలను మూరగొన్న వాణిశ్రీగారి పేరు మారింది. ఇప్పుడు వాణిశ్రీగారి పేరు వాణిశ్రీకరుణాకరన్. ఫిబ్రవరిలో వాణిశ్రీగారి వివాహం జరిగిన విషయం పాఠక విదితం. హడావుడిగా జరిగిన ఆ వివాహానికి అందర్నీ ఆహ్వానించలేకపోయినందుకు బాధపడింది వాణిశ్రీ. మార్చి 30న పెద్ద ఎత్తున




ఉల్లావుద్దీన్ అద్భుత దీపం'లో రజనీకాంత్, బిందు

## ఎన్టీఆర్ .. సుప్రీమ్ !

ఎందుకని పాఠకులు అడగరు కారణం ఆయన చిత్రాలు ఎంత విజయాన్ని సాధిస్తున్నాయో ప్రేక్షకులకు తెలుసుగనుక

1979లో యిప్పటివరకు విడుదలైన చిత్రాలలో శ్రీ ఎన్టీఆర్ నటించిన ''డ్రైవరు రాముడు'' అమోఘ ఆర్థిక విజయాన్ని సాధించింది

శ్రీ ఎన్టీఆర్‌తో చిత్రాన్ని ప్రకటిస్తే చాలు ''క్యూ'' వరుసలో వున్నారు కొనుగోలుదార్లు

ఒకప్పుడు శ్రీ ఎన్టీఆర్ ''మాస్‌హీరో''గా ప్రఖ్యాతిపొందారు కానీ, యిప్పుడు ఆయన ''అందరి హీరో''గా విజయవిహారం చేస్తున్నారు

శ్రీ ఎన్టీఆర్ విజయానికి కారణం నిరంతర కృషి, ఆత్మధైర్యం, కాలానుగుణమైన మార్పు, వుపకారం చేసే మనస్తత్వం

**నమ్మి తేచాలు !**

శ్రీ ఎన్టీఆర్ ఎంత మంచివారంటే తనను ఆశ్రయించి, సహాయాన్ని అర్థించే నిర్మాతలకు అభయం వొసగి వారి శ్రేయస్సుకు మనస్ఫూర్తిగా సహకరిస్తారు

విరోధికికూడా అపకారం చెయ్యలేని మహామనీషి ఈనాడు తెలుగు చిత్ర పరిశ్రమ వెలుగొందడానికి కారణకర్తగా వున్న వసూళ్ల నాయకుడు శ్రీ రామారావు

దైవభక్తిని, ప్రేక్షకుల అనురక్తిని నమ్మి జీవితాన్ని సాగిస్తున్న వుత్తమ మానవుడుగా శ్రీ ఎన్టీఆర్‌ను పేర్కొనాలి

**ఆయనకు ఆయనే పోటీ !**

చిత్ర పరిశ్రమలో శ్రీ ఎన్టీఆర్‌కు పోటీగా నిలబడగల శక్తి ఆయనకు మాత్రమే వుంది ఆయన చిత్రాలకు వచ్చిన వసూళ్లు మరెవ్వరికి రాదేమోకూడా ! పౌరాణికాలలో ''లవకుశ, సాంఘికాలలో అడవిరాముడు'' జానపదాలలో జయసింహ'' చిత్రాలు ఆర్జించిన వసూళ్లు మళ్లీ రావాలంటే, శ్రీ ఎన్టీఆర్ చిత్రాలే సాధించాలి

## సి ని మా

**ప్రపంచంలో మొదటి వ్యక్తి**

ప్రపంచ చలన చిత్ర రంగంలో ఏ నటుడు చెయ్యని సాహసాన్ని చేసినదికూడా శ్రీ రామారావే

ఐదు పాత్రలను పోషిస్తూ, కథ సంవిధానాన్ని సమకూర్చి, దర్శకత్వం నిర్వహించడం ప్రపంచంలో ఎవ్వరూ చెయ్యలేని పని అట్టి పని చెయ్యగలను అని శ్రీ ఎన్టీఆర్ నిరూపించారు

ప్రపంచ వుత్తమ నటుడుగా శ్రీ ఎన్టీఆర్‌ను ఎంపికచేస్తే పరిశ్రమ ఎంతో సంతోషిస్తుంది

అమెరికాను కొలంబస్ కనిపెట్టినట్టు శ్రీ ఎన్టీఆర్ నటనకు కొత్త నిర్వచనం యిచ్చారు

**ఆయన మంచితనం**

శ్రీ ఎన్టీఆర్ మంచితనం ఎంత గొప్పదో, ఎంత విశాలమైనదో తెలుసా ? తను వ్రాసుకున్న కథలను తన నిర్మాతలపై రుద్దక తనే చిత్రాలుగా నిర్మించడం ఆయన వితరణశీలానికి నిదర్శనం

తమ స్టుడియోను నిర్మించినా నిర్మాతలను హైదరాబాదులోనే చిత్రాలు నిర్మించాలని ఆంక్ష విధించకపోవడం శ్రీ ఎన్టీఆర్ వితరణకు మరో నిదర్శనం

**అంగీకరించిన చిత్రాలు**

ఈ సంవత్సరం శ్రీ ఎన్టీఆర్ ఏడు కొత్త చిత్రాలను అంగీకరించారు అన్నీ సాంఘికాలే తనవిమ్మాత్రం పౌరాణికాలు

**ప్రజానటుడు ప్రజాదర్శకుడు కలిసిన చిత్రం**

''మనుషులంతా ఒక్కటే'' చిత్ర విజయానంతరం శ్రీ ఎన్టీఆర్ శ్రీ డి ఎన్ ఆర్ కలిసి పనిచేసే రోజు యిప్పుడాసన్నమైంది

ప్రజానటుడుగా శ్రీ రామారావుపట్ల ఎంత అభిమానం వుందో ప్రజలకు దర్శకుడుగా శ్రీ దాసరి పట్ల అంత లైకింగ్ వుంది

ఈ కలయిక ఎప్పుడు ఏర్పడుతుందా అని వేయి కండ్లతో ఎదురుచూచిన లక్షలాది ప్రేక్షకులకు సెప్టెంబరు 15 పండుగరోజు అవుతుంది ఆరోజున శ్రీ ఎన్టీఆర్ శ్రీ డి ఎన్ ఆర్ నాయక దర్శకులుగా పదవి వహిస్తారు

---

రారాజెళ్ళాలు ... ఉడఎంలో పరిశ్రమకు కట్టి విందునిచ్చి, తన భర్తను అందరికీ పరిచయం చేసింది వాణిశ్రీగారి వైవాహిక జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఈ కలం ఆశిస్తూంది

## ఇది విన్నారా ?

★ ''చిల్లరకొట్టు చిట్టెమ్మ'' లాంటి విజయవంతమైన చిత్రాన్ని శ్రీ దాసరి నారాయణ రావు దర్శకత్వంలో నిర్మించిన లక్ష్మీజ్యోతి ఫిలిమ్స్ అధినేత శ్రీ ఆర్ యస్ రాజా ఇప్పుడు అదే చిత్రాన్ని శ్రీ దొరై దర్శకత్వంలో ''పెణ్ణుక్కు యార్ కావల్'' (ఆడదానికి ఎవరు దిక్కు) పేరుతో తమిళంలో నిర్మిస్తున్నారు ఈ చిత్రం షూటింగ్ ఏప్రిల్ 10న ఎన్నూరులో ప్రారంభమైంది ''చిట్టెమ్మ'' పాత్రను జయచిత్ర, గోకిన రామారావు పాత్రను శ్రీకాంత్, మాదా పాత్రను సురులిరాజన్, బెనర్జీ పాత్రను వి కె రామస్వామి, కె వి చలం పాత్రను తేంగాయ్ శ్రీనివాసన్ పోషిస్తున్నారు మురళీమోహన్ పాత్రను విజయకుమార్ పోషించవచ్చు శ్రీ రమేష్‌నాయుడు సంగీతం సమకూరుస్తున్న ఈ చిత్రంలో జయమాని నృత్యం మరొక ప్రత్యేకాకర్షణ



'గంధర్వ కన్య'లో మంజుభార్గవి

# జి. ఏ. జి. పేజీ

**చిత్రాల జోరు**

విడుదలైన చిత్రాల గతి అంతంతమాత్రంగానే ఉన్నా — మద్రాసులో మాత్రం దాదాపు ప్రతిరోజూ ఒకటో రెండో చిత్రాలకు ప్రారంభోత్సవాలు జరుగుతూనే ఉన్నాయి ఎక్కడ చూసినా ఒకటే హడావిడి — అంతా వేగం ఈ ఉధృతం చిత్ర పరిశ్రమకు మంచిదికాదని అనుభవజ్ఞుల అభిప్రాయం అయినా, దీన్ని ఎవరూ అరికట్టలేరు ఇటీవల ఈ చిత్రాల రద్దీ మరీ ఎంత విపరీతంగా పెరిగిందంటే — రికార్డింగ్ థియేటర్లు, డబ్బింగ్ థియేటర్లు ఎక్కడా ఖాళీగా లేవు నటీనటులు — కొత్తవారితో సైతం అందరూ బిజీగా ఉంటున్నారు చిత్రాల సెన్సారింగ్‌కు డేట్‌లు దొరకడం మరీ కష్టంగా ఉంది

ఈ వారం అందిన కొత్త చిత్రాల విశేషాలను తెలియజేస్తున్నాను

రవి చిత్ర ఫిలిమ్స్ "మా తొమ్మిదవ చిత్రాన్ని ఆంధ్రప్రదేశ్‌లో నిర్మిస్తున్నాను," అని తెలియజేశారు వై. వి. రావ్ యాభై రోజులకు పైగా హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడిచి, శతదినోత్సవం చేసుకోబోతూన్న "లక్ష్మి" అనే



'అందగాడు'లో శ్రీదేవి, సీమ

తమిళ చిత్రం ఆధారంగా ఐ. ఎన్. మూర్తి దర్శకత్వంలో తయారయ్యే వర్ణ చిత్రానికి గొల్లపూడి స్క్రిప్టు రాస్తున్నారు. సత్యం సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. రాజగోపాల్ ఎడిటరు. చిత్తూరు పరిసర ప్రాంతాలలో మే, జూన్ నెలల్లో చిత్రీకరణ జరుగుతుంది. ఇందులో ఒక కోతికి ప్రముఖ పాత్ర ఉంది.

శ్రీ రమణ చిత్ర: వెరైటీ ఇతివృత్తాలను తెరకెక్కించడం నటుడు చలం ప్రత్యేకత. "సంబరాల రాంబాబు, మట్టిలో మాణిక్యం, బుల్లెమ్మ బుల్లోడు, దేవుడమ్మ, తులాభారం, తోట రాముడు, డూ డూ బసవన్న" అనంతరం చలం త్వరలో ప్రారంభించే కొత్త వర్ణ చిత్రం "సన్నాయి అప్పన్న"లో శోభన్‌బాబు హీరో.

విజయకళా ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం "పంచభూతాలు" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉండగా, ఎన్. టి. ఆర్., సత్యనారాయణ ప్రభృతులతో ఎం. పీతాంబరం ప్రారంభించిన కొత్త చిత్రానికి విజయవంతమైన "డాన్" హిందీ చిత్రం ఆధారం. ఏప్రిల్ 14న "నా పరువం నీకోసం పానుపు వేసి ఉన్నది" అనే సి. నారాయణ రెడ్డి గీతం ఎస్. జానకి గానంతో ప్రసాద్ స్టూడియోలో ధ్వనిముద్రిక చేయబడింది. ఇళయరాజా సంగీత దర్శకుడు. డి. వి. నరసరాజు సంభాషణలకర్త. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.

శ్రీ వాణీ వరలక్ష్మి కంబైన్స్: "చిట్టెమ్మ—చిలకమ్మ" చిత్రం ద్వారా దర్శకుడుగా పరిచయమైన పోలవరపు బ్రహ్మానందరావు కొత్తగా "రతి మన్మథ" అనే సాంఘిక చిత్రానికి దర్శకత్వం వెలవుతున్నారు. ఏప్రిల్ 3న హార్స్లీ హిల్స్‌లో ప్రారంభమైన షూటింగు అక్కడే ఏప్రిల్ నెలాఖరుకు ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది.

సంగీత, ప్రసాద్‌బాబు, వంకాయల సత్యనారాయణ, ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ నటుడు గోపీకృష్ణ ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. రమణమూర్తి రచయిత. వి. ఎ. రామ్ చౌదరి ఛాయాగ్రాహకుడు. కూర్పు: నాయని మహేశ్వరరావు. నిర్వహణ: ఎం. వి. రామకృష్ణ. ఎన్. వి. సుబ్బారావు సమర్పణలో పి. వి. ఎస్. వి. ప్రసాద్ నిర్మాత.

రామకృష్ణా ఫిలిమ్స్: రంగనాథ్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, కాంతారావు, లక్ష్మీకాంత్, హరిబాబు, సి. హెచ్. కృష్ణమూర్తి, జయభాస్కర్, కె. కె. శర్మ, ప్రభ, మోహిని మున్నగువారితో రామకృష్ణారెడ్డి సమర్పించే "సాము—పగ" వర్ణ చిత్రాన్ని గిరిధర్, బి.కామ్., స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మొలకల సుబ్బరామరెడ్డి, ఎం. ప్రభావతమ్మ నిర్మిస్తున్నారు. చిట్టిబాబు సహదర్శకుడు. రాజశ్రీ రచయిత. చక్రవర్తి సంగీత దర్శకుడు. కె. ఎస్. మణి ఛాయాగ్రాహకుడు. శిల్పం: భాస్కరరాజు. కూర్పు: నరసింహారావు. ఏప్రిల్ 14 నుండి రాజమండ్రి సమీపంలో ఉన్న దంగేరు ప్రాంతాలలో చిత్రీకరణ జరుగుతోంది.

నటరాజా ఆర్ట్ క్రియేషన్స్: చంద్రమోహన్, శరత్‌బాబు, అల్లు రామలింగయ్య, రాంబాబు, బాలకృష్ణ, మాధవి, రోజారమణి నటించే "ఇల్లే స్వర్గం" వర్ణ చిత్రాన్ని శంభంగి అప్పారావు, చీకటి ఆంజనేయులు నిర్మిస్తున్నారు. బొర్ల ముంత శివరామకృష్ణయ్య రచయిత. రమేష్‌నాయుడు సంగీతంలో దేవులపల్లి, శ్రీశ్రీ, ఎం. రామకృష్ణ గీతాలు రాస్తున్నారు. బాబూరావు ఛాయాగ్రాహకుడు. ఎస్. ఎం. సంతానం సహ దర్శకుడు. కూర్పు: ఎన్. పి. వీరప్ప. శిల్పం: రంగారావు. నిర్వహణ: అడుసుమిల్లి వెంకటేశ్వరరావు. సమర్పణ: నేరుసు సూర్యనారాయణమూర్తి. దర్శకుడు: గోర సత్యనారాయణమూర్తి. మే 1 నుండి 20 వరకు గుడివాడ పరిసర ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది.

ఉమా ఫిలిమ్ కంబైన్స్: దాసరి నారాయణరావు రచన, దర్శకత్వంలో ప్రముఖ పంపిణీ సంస్థ పూర్ణా పిక్చర్స్‌లో పి. ఆర్. ఓ అయిన హరగోపాల్ ఒక వర్ణ చిత్రాన్ని జూన్, జూలై మాసాలలో నిర్మిస్తారు.

కె. సి. ఫిలిమ్స్: దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంతో ఎన్. టి. ఆర్., జయప్రద నటించే వర్ణ చిత్రాన్ని కోవై చెరియన్ నిర్మిస్తారు. మహదేవన్ స్వరకల్పనలో వేటూరి గీతాలు రాస్తున్నారు. పి. ఎల్. రాయ్ ఛాయాగ్రాహకుడు. సెప్టెంబర్ 16న షూటింగ్ ప్రారంభమౌతుంది.

'జూదగాడు'లో అంజలీదేవి, శోభన్‌బాబు



# * జి. వి. జి. పేజీ *



'వినాయక విజయం'లో ప్రభ

## మే 13న విశాఖలో ఎన్.టి.ఆర్.కు భారీ సన్మానం

ఎంతో మంది తెలుగు ప్రముఖులున్న మద్రాసు నగరంలో తెలుగువారి సాంస్కృతిక కార్యక్రమాలు నడిపించడానికి బహుళార్థ ప్రయోజనకారిగా వుండే సువిశాలమైన భవంతిని నిర్మించడానికి అంతర్జాతీయ తెలుగు విద్యార్థి సాంస్కృతిక సభ పూనుకుంది. మద్రాసుకు వచ్చే యాత్రికుల వసతి సౌకర్యంతోపాటు వివాహాది శుభకార్యాలకు కూడా తక్కువ రేట్లతో ఉపయోగపడే ఈ భవంతి పై వచ్చే ఆదాయంతో యావత్ భారతావనిలోని తెలుగు పిల్లలకు విద్యా వైద్య సౌకర్యాలు సమకూర్చబడతాయి. ఈ సమితికి బొబ్బిలి రాజా శ్రీ ఆర్. వి. జి. కె. రంగారావుగారు ఛైర్మన్. ఈ సందర్భంగా నిధులు సేకరించే నిమిత్తం ఎన్. టి. రామారావుగారికి విశాఖపట్నం సౌత్ ఈస్టరన్ రైల్వే గ్రౌండ్స్‌లో మే 13 సాయంకాలం ఘనమైన సన్మానోత్సవం జరుగుతుంది. వెంపటి చినసత్యం సమర్పణలో కూచిపూడి ఆర్ట్స్ అకాడమీ వారి "శ్రీకృష్ణ పారిజాతం" నృత్య నాటిక ప్రదర్శింపబడుతుందికూడా. కార్యక్రమాలను నటుడు, రచయిత రావి కొండలరావు నిర్వహిస్తారు.

'మొదటి రాత్రి'లో రామకుమార్, చంద్రలేఖ



## ఇంటింటి రామాయణంలో ఆభిమానాల మధ్య ఆదర్శాల అంతర్యుద్ధం

డాక్టర్ జయకృష్ణ (రంగనాథ్) పూలమాలతో ఇంటికి వచ్చేసరికి రాత్రి పదకొండు దాటింది. హాల్లో సోఫాలో కూర్చుని కునికిపాట్లు పడుతున్న భార్య విజయ (ప్రభ)ని లేపి, "సారీ! కాస్త లేటయింది," అన్నాడు.

"ఈ లేటు మీ కలవాటైపోయింది. కాని, ఈ వంటరి జీవితం నాకెప్పుడూ అలవాటులేదు," అంది విజయ.

"ఏం చెయ్యను, విజయా! ఈవేళ స్లమ్ ఏరియాకు వెళ్లాను. పాపం, గంజి తాగడానికి కూలీల్లేని ఆ పేదవాళ్లు అనారోగ్యంతో క్రుంగి కృశించిపోతున్నారు. ఈ దండ చూశావా — వాళ్లెంతో ఆప్యాయంగా నా మెళ్లో వేశారు."

"వెధవ దండ. పదిరూపాయలు పారేస్తే, ఇలాంటివి పది వస్తాయి."

"డబ్బు పారేసి కొనుక్కునే దండల్లో అభిమానముండదు, విజయా! వాళ్ల గుండెలు నుదిగుచ్చి ఈ దండగా నా మెడలో వేశారు."

"అదే...ఆ అభిమానాన్ని చూసి మురిసిపోయి, ఫ్రీగా వైద్యం చేస్తారనే — ఆ దండలువేసి, దణ్ణాలు పెడతారు వాళ్లు. ఊళ్ళో ఇంకే డాక్టరైనా వాళ్ల విషయం పట్టించుకున్నారా? కట్టుకున్న పెళ్లాం విషయం మరిచిపోయి, దణ్ణంపెట్టే దరిద్రుల కొంపలకి వైద్యమంటూ పరిగెత్తుతున్నారా?" అంది ఆవేశంగా విజయ.

"విజయా!" కోపోద్రేకంతో అరిచిన జయకృష్ణ అంతలోనే తమాయించుకొని, "ఈ విషయంలో ఇంకేం మాట్లాడకు. ఐ కెనాట్ టాలరేట్!" అంటూ చకచకా వెళ్లిపోయాడు.

నవత ఆర్ట్స్ "ఇంటింటి రామాయణం" వర్ణ చిత్రాన్ని పి. సాంబశివరావు దర్శకత్వంలో ఎన్. కృష్ణంరాజు నిర్మించారు.

## ఛాయ

హనుమాన్ ప్రసాద్ దర్శకత్వంలో శ్రీ వెంకటకృష్ణ ఫిలిమ్స్ వారి "ఛాయ" చిత్రం ఖమ్మం, సీలేరు, కిన్నెరసాని, భద్రాచలం వగైరా ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో రూపురేఖలు దిద్దుకొని, విడుదలకు సిద్ధంగా వుంది. సత్యేంద్ర కుమార్, నూతన్ ప్రసాద్, రూప, శివాజీ, పి. ఎల్. నారాయణ, శైలజ, సత్యచిత్ర, అన్నపూర్ణ, వరలక్ష్మి, రాజేంద్రప్రసాద్, సత్తిబాబు, రాళ్ళబండి కామేశ్వరరావు, పద్మ,



'మావూళ్లో మహాశివుడు'లో రావుగోపాలరావు

విజయలక్ష్మి పాల్గొన్నారు. శ్రీధర్, సత్యనారాయణరాజు కూర్చిన కథకు ఎస్. ఆర్. వేజళ్ళ స్క్రీన్‌ప్లేను, పరుచూరి సంభాషణలను రాశారు. వేటూరి, సి. నారాయణరెడ్డి గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. లక్ష్మణ్ గోరే ఛాయాగ్రాహకుడు. ఈశ్వరరెడ్డి సహకార దర్శకుడు. నిర్వహణ : సామినేని. నిర్మాణత : ఎస్. ఆర్. వేజళ్ళ. నిర్మాతలు : వి. వి. అప్పారావు, సి. హెచ్. కృష్ణమూర్తి, పాటిబండ్ల స్వరాజ్యలక్ష్మి.

## గుణాత్మక విలువలు గల చిత్రాలకు కొత్త రకం సర్టిఫికెట్

ఉన్నతమైన కథా చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించే నిమిత్తం మహోన్నతమైన ప్రమాణాలు గల చిత్రాలకు 'క్వా' (క్వాలిటీ) సర్టిఫికేట్ ఇచ్చే ప్రతిపాదనను కేంద్ర ఫిలిమ్ సెన్సార్ బోర్డు పరిశీలిస్తోంది. ఇలాంటి 'క్వా' సర్టిఫికేట్ చిత్రాలను నిర్మించడానికి మన నిర్మాతలు 'క్యూ'లో నిలుచుంటారా?



## జి వి జి పేజీ

### రాజాచంద్ర దర్శకత్వంలో మూడు చిత్రాలు

"బంట్రోతు భార్య, దేవుడే దిగివస్తే" చిత్రాలను నిర్మించిన అల్లు అరవింద్ ఇప్పుడు గీతా సినీ ఎంటర్‌ప్రైసెస్ పతాకంలో "మా ఊళ్ళో మహాశివుడు" అనే చిత్రాన్ని హైదరాబాద్, తిరుపతి పరిసరాలలో నిర్మిస్తున్నారు. మురళీమోహన్, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, రాజ్‌బాబు, ప్రసాద్‌బాబు, వంకాయల, సుభాషిణి, రమాప్రభ, పుష్పలత నటిస్తున్నారు. అప్పలాచార్య సంభాషణలకర్త. సత్యం సంగీత దర్శకుడు. కన్నప్ప ఛాయాగ్రాహకుడు. శిల్పం, కూర్పులను భాస్కరరాజు, కందస్వామి నిర్వహిస్తున్నారు.

డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ నిర్మాతగా ఉప్పలపాటి సూర్యనారాయణబాబు సమర్పించే "నా ఇల్లు — నా వాళ్ళు" చిత్రంలో శ్రీధర్, మురళీమోహన్, గుమ్మడి, గిరిబాబు, నూతన్ ప్రసాద్, త్యాగరాజు, రాళ్ళపల్లి, సుభాషిణి, కె. విజయ, సావిత్రి, భావన, రమాప్రభ, నిర్మల పాత్రధారులు. జంధ్యాల రచయిత. ఆత్రేయ గీతాలకు జె. వి. రాఘవులు బాణీలు కూర్చారు. ఛాయ, శిల్పం, కూర్పులను రఘునాథరెడ్డి, కొండపనేని రామలింగేశ్వరరావు, కోటగిరి గోపాలరావు నిర్వహిస్తున్నారు.

'ఛాయ'లో రూప, నూతన్‌ప్రసాద్

శ్రీ కుమారస్వామి పిక్చర్స్ పతాకంలో జ్యోతి కుమారస్వామి నిర్మించే వర్ణ చిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు, మోహన్‌బాబు, కాంతారావు, రాజసులోచన, మమత, నిర్మల వగైరా నటవర్గం. రాజశ్రీ, సత్యం, జె. సత్యనారాయణ, భాస్కరరాజు తెర వెనుక కృషి చేస్తున్నారు. నిర్వహణ : పింజల సుబ్బారావు.

### "అల్లావుద్దీన్ - అద్భుత దీపం"

"మన వూరి పాండవులు" చిత్రంతో సంచలనం సృష్టించిన నిర్మాత జయకృష్ణ "అల్లావుద్దీన్ — అద్భుత దీపం" స్కోప్ కలర్ చిత్రంతో మళ్ళీ సంచలనం కలిగించబోతున్నారు ఈ చిత్ర దర్శకుడు ఐ. వి. శశి తమిళ, మళయాళ భాషలలో శృంగారానికి ప్రాధాన్యత గల చిత్రాలకు నేర్పుతో దర్శకత్వం వహించారు. అందుకే ఆయన అభిమానులు ఆయన్ని ఐ. వి. సెక్సీ అని కూడా అంటూంటారు. మరో తమాషా ఏమిటంటే ఆయన చిత్రాల పేర్లన్నీ 'అ' అక్షరంతో ప్రారంభమవుతాయి. అవి "అవళుడె రావుగళ్, అనుభవం, అభినందనం, అభినివేశం, అయిల్ కారి, అంజలి, అంతర్దాహం, అమానుషం" బ్రహ్మాండమైన సెట్‌లతో భారీ ఎత్తున తయారౌతూన్న జయకృష్ణా ఫిలిమ్స్ "అల్లావుద్దీన్ — అద్భుత దీపం" చిత్రంలో కమలహాసన్, రజనీకాంత్, శ్రీప్రియ, జయభారతి, సావిత్రి, హిందీ నర్తకీమణులు బిందు, హెలెన్, జయశ్రీ టి. పాల్గొంటున్నారు. రాజశ్రీ రచన, దేవరాజ్ సంగీతం, రామచంద్రబాబు ఛాయ, బాబూభాయ్ మిస్త్రీ — రవికాంత్ నగాయిచ్‌ల తాంత్రిక ఛాయాగ్రహణం ఈ వినోదాత్మక చిత్రంలో ఇతర ఆకర్షణలు.

# కళారంజితమైన గోకుల్

భరత నాట్యంవలే అపూర్వమైన పౌడర్ గోకుల్. దక్షిణ దేశపు కళలవలే కళారంజితమైనది. మెత్తటి చందనమునకు, శ్రేష్టమైన మూలికలు చేకూర్చబడినవి.

గోకుల్ సాన్‌డల్‌వుడ్ పౌడరు వేసవి కాల ఉష్ణము నుండి మీ శరీరము నల్లబడకుండా కాపాడును. గోకుల్ సాన్‌టూల్ రోజంతా చందన సువాసనలో మిమ్ము హాయిగా వుంచుతుంది.

గోకుల్ పౌడర్ ఉపయోగించండి.
వసంతకాల పువ్వులా తాజాగా వుండండి.



## గోకుల్

సాన్‌టాల్ &
సాన్‌డల్ వుడ్
పౌడరు

టి. యస్. ఆర్. & కంపెని.,
మదరాసు 600 089.




ADWAVE | TSR 1019 TEL

# బొమ్మల మహాభారతం — కౌరవుల ఘోష యాత్ర — మండపాక సీతారామాంజనేయులు

ప్రారంభం!

























ఇంకా వుంది

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# ఒకవేళ సారిడాన్ కూడా మీ ఒళ్ళునొప్పుల్ని తగ్గించకపోతే డాక్టర్ని సంప్రదించండి.

ఒక సారిడాన్ త్వరితంగా మీ కండరాల నొప్పుల్ని దూరం చేస్తుంది. మిమ్మల్ని హాయిగా తాజాగా ఉంచుతుంది. అయితే, ఒక్కొక్కప్పుడు ఒళ్ళునొప్పులు ఎంత తీవ్రంగా,




అసాధ్యంగా ఉంటాయంటే సారిడాన్ కూడా కొద్దిగ లేనంతగా ఉంటాయి. అలాంటప్పుడు డాక్టర్ని సంప్రదించండి. మీకు ఎలాంటి మందు సరిపడుతుందో డాక్టర్ని నిర్ణయించనివ్వండి.

# సారిడన్

ట్రేడ్‌మార్కు 'రోష్'

## అమోఘమైనది, సురక్షితమైనది

## ఒకటి వేసుకొంటే చాలు




RP-4161



# ఆంతర్యం

కందుకూరి వెంకటమహాలక్ష్మి

"మనూ! ఇవేళ సాయంకాలం సినిమాకి వెళ్దామా?" అని ఫైల్సు బల్లమీద పెట్టబోతున్న మనోరమ కేసి చిలిపిగా చూస్తూ ఆ ఫైల్సు బల్లమీద పెట్టనివ్వకుండా ఆమె చేతితో సహా వాటిని అందుకున్నాడు ఆఫీసరు ఆనందం.

"అలాగేనండీ! ఎన్ని గంటలకు రెడీగా వుండమంటారు? అన్నట్లు నన్ను హాలు దగ్గరకి రమ్మంటారా, లేక మీరొచ్చి నన్ను పికప్ చేసుకుంటారా?" అంది అందంగా వున్న కళ్లను మరి కొంచెం అందంగా తిప్పుతూ టైపిస్టు మనోరమ.

"నేనే నీ రూమ్‌కి ఆరు గంటల కల్లా వస్తాను. సరేనా?" అన్నాడు ఆనందం.

"ఓకే" అంటూ నెమ్మదిగా ఫైళ్ళ క్రింద ఆనందం చేతిలో నలుగుతున్న తన వేళ్ళని తీసుకుంటూ, రొమాంటిక్‌గా ఓ నవ్వు విసిరి బైటకి వెళ్లిపోయింది.

ఇది ఆనందం మనోరమలమధ్య దినచర్య అయిపోయింది. కుమారి అయిన ఆమె ఆఫీసులో పనిచేసే అమ్మాయి లందర్లోకి అందగత్తె. దేముడు కొందర్ని మరీ అందంగా సృష్టిస్తాడు. వంకపెడదామన్నా ఆమెలో వంకలేదు. ఆమె అందానికి మెరుగులు దిద్దుతాయి ఆమె బట్టు, కట్టూ, నడక. నడుస్తుంటేనే "కందిపోతాయేమో" అనిపించే పాదాలు. వాటికి తగ్గట్టుండే నడక. నుదుట నిరటి బొట్టు, తెల్ల చీర, తెల్ల జాకెట్టు ఆమె అందానికి మరింత శోభ తెస్తాయి.

మనోరమ ఆ ఆఫీసులో చేరి నాలుగేళ్ళు అయింది. ఈ నాలుగేళ్ళ జీవితంలో ఆ ఆఫీసులో ఆమె వెంట బడని పురుషుడు లేడు. కొందరు మాటల్లోనూ, కొందరు చేతల్లోనూ ఆమె యందు ప్రేమని ఒలకబోస్తూ చెప్పే కబుర్లకీ, చేతలకి మృదువైన నవ్వుతోటి సమాధాన మిచ్చేది. ఈ నాలుగేళ్లలోనూ ఈ ఆఫీసులో మగవారి మధ్య అనేక రకాల అనుభవాలని పొంది, మగవాళ్ల గురించి బాగా తెలుసుకుంది. కాని ఏ ఒక్కరికీ లొంగలేదు. కొందరు ప్రేమలేఖలు వ్రాసి వారి విరహాన్నంతా వెళ్లబోసుకునేవారు. కొందరు ఒంటరిగా వున్న తన రూమ్‌కి వచ్చి వెకిలిగా ప్రవర్తించడం లాంటివి కూడా జరిగాయి. కాని ప్రతి ఒక్కర్నీ ఉట్టి చేతులతోనే తిరిగి వెళ్ళేరు.

కొత్తగా ఈ వూరు బదిలీ అయిన ఆనందంతో ఆమెకి ఒకటిరెండు నెలల్లోనే అయిన పరిచయాన్ని, అది ప్రేమగా మారడాన్ని కనిపెడుతున్న పురుషులంతా అవకాశం చిక్కినందుకు ఆమెని ఏకడం ప్రారంభించారు. తమకి అందని ఫలం ఇతరులకి అందడం సహించలేని ఈ మగవారంతా మనోరమ వినగా నానా మాటలూ అనడం ఆమెకి వినపడక పోలేదు.

"ఇన్నాళ్ళూ మడి కట్టుకుని కూర్చుంది కదురా?"

"మడి కాదురా బాబూ! పెద్ద ఆఫీసర్ని కావాలనుకుంటూ!"

"మరి ఇదివరకటి ఆఫీసర్లు నచ్చలేదేం? వాళ్ళూ రుచి చూద్దామను కున్నారుగా?"

"వాళ్ళు నచ్చలేదనట్టుంది. ఈ స్ఫోటకం మచ్చలూ, భూతద్దాల వంటి కళ్ళజోడూ ఆ ఆఫీసర్లకి లేవుగా...!"

ఇటువంటి వెటకారాలు ఆ చెవిని విని ఈ చెవితో వదిలేసేది. ఎవర్నీ పట్టించుకుని జవాబిచ్చేది కాదు. అలాగని ఆనందంతో తిరగడమూ, మాట్లాడడమూ మానలేదు.

ఆఫీసర్‌గా వచ్చిన మొదట్లోనే ఆనందానికి ఇచ్చిన కాగితం అందుకో [illegible] వెర్రివాడిలా, స్ఫోటకం కమ్మిన కళ్ళతో మనోరమనే చూస్తూ వుండిపోయాడు. అనాటి అగాయితూ ఆమెని పదే పదే తన రూమ్‌లోకి పిలుస్తూ, ఆమెకి డిక్టేషన్ చెప్పడానికి బదులు ఆమెని, ఆమె ఒంపు సొంపుల్ని ముగ్ధుడై చూస్తూ కూర్చునేవాడు. మెల్లి మెల్లిగా ఆమెతో కబుర్లు చెప్పడం, బల్ల క్రింద ఆమె పాదాల్ని తొక్కడం, ఆమె వేళ్ళని ముట్టీ ముట్టనట్లు స్పృశించడం వంటివి చేసి ఆమె మనస్తత్వాన్ని తెలుసుకోజూశాడు. ఆమె అతను చేసే ఈ చిన్న, చిన్న పనులకు అభ్యంతరం చెప్పడంగానీ, కోపగించుకోడంగానీ, బాధ పడడంగానీ చెయ్యక పోవడం వాడికి మరి కొంచెం చొరవ చేసుకుని, బాహాటంగా ప్రవర్తించడానికి అవకాశం ఇచ్చింది.

ఇప్పుడు ఆఫీసులో ప్రతి ఒక్కరికీ ఆశ్చర్యం, అసూయనీ కలిగించే విషయం ఒక్కటే. అదే మనోరమ, ఆనందాల ప్రేమ

కలాపాలు, నాలుగళ్ళుగా మనోరమని ఆ ఆఫీసులో అడా, మగా చూస్తున్నారు బైటింకి ఆఫీసుకి రావడం, తనపని చూసుకోవడం పలకరించిన వారితో నవ్వుతూ నాలుగు కబుర్లు చెప్పడంతప్ప అతిగా ఎవ్వరితో చొరవ తీసుకునేది కాదు మొదట్లో ఆమె వెంట పడే మగవారిలో కూడా రాను రాను ఆమె ప్రవర్తన వల్ల మార్పు వచ్చి, ఆమెయందు మంచి గౌరవ భావం కలిగేది ఒకరిద్దరు ఆఫీసర్లు కూడా ఆమెమీద కన్ను వెయ్యక పోలేదు వారికి ఏవిధమైన ఆగ్రహం కలగ కుండానే మర్యాదగా తన పన్లు ముగించు కుని, మౌనంగా వచ్చేసేది అలాంటి మనో రమ ఈనాడు ఇద్దరు పిల్లల తండ్రి అయిన ఆనందంలో సినిమాలూ, షికార్లూ, డిక్టేషన్ పేరున ఆఫీసరు గదిలో గంటల తరబడి కూర్చోడం, ఎవ్వరికీ అంతు చిక్కడం లేదు పోనీ అందగాడా? అంటే అదీ లేదు.

ఇన్నాళ్ళుగ గౌరవ భావంతో చూస్తున్న ప్రతీ ఒక్కరి దృష్టిలో నుంచి మనోరమ మలకనై పోవడమే కాకుండా ప్రతివారి విమర్శలకీ గురికావలసి వస్తోంది కొందరు ఆమెని వారించారు కొందరు నిజంగానే ఆమె మేలుకోరి "నీకు భర్త దొరక్కపోతా డనే పెళ్ళయిన వాడివెంట తిరుగుతున్నావా? ఇది నీకు ఏ విధానా మంచిది కాదు పైగా తోటి ఆడదాన్ని, దాని సంసారాన్ని నాశనం చేస్తున్నావు. ఆలోచించుకో నీ మేలుకోరి చెప్పుతున్నాం" అంటూ చెప్పే మాటలుఏ

# అంతర్యం

నవ్వి వూరుకునేది ఆమెలో వచ్చిన ఈ మార్పు అందరికీ వింతగా వుండేది ప్రతీ ఒక్కరికీ అంతు చిక్కని ప్రశ్నయి కూర్చుంది

సినిమా నుంచి తిన్నగా పార్కు దగ్గర కారు ఆపి, "కాస్సేపు చల్లగాలిలో కూర్చుని ఇంటికి వెళ్దాంరా మనూ!" అంటూ పార్కులోకి దారి తీశాడు పార్కులో మూలగా జన సంచారం లేని ప్రాంతంలోన, లైటు వెలుతురు పడని ఓ చోటు చూపిస్తూ "కూర్చో"మన్నాడు రోజూ కన్నా ఈరోజు కొంచెం ఎక్కువ చొరవ తీసుకుంటూ ఆమెకి దగ్గరగా జరిగి కూర్చున్నాడు

"మను ఎల్లుండి ఆదివారం హోటల్ లోడ్జిలో ఓ రూమ్ బుక్ చేశాను మనం ఒంటరిగా గడపడానికి అది అనువైన జాగా ఇన్నాళ్ళుగా దూరం దూరంగానే అనుభ విస్తున్న ఈ ఆనందాన్ని అక్కడ మరీ దగ్గరగా ప్రథమంగా ఒకటై అనుభవించవచ్చు నీకేం అభ్యంతరం లేదు కదూ?" ఆమె సమాధానం కోసం ఆత్రుతగ ఎదురు చూడ సాగేడు

ఎప్పటిలాగే నవ్వుతూ "సరే" అన్నట్లు తలూపింది మనోరమ

ఆనందం సంతోషానికి అంతు లేక పోయింది ఎవ్వరికీ లొంగని ఒక కమలం తనకి ఇంతలా లొంగిపోవడానికి కారణం తన మగతనమే అనుకుంటూ వుక్కిరి బిక్కిరి అవుతూ, గాలిలో తేలిపోతు వున్న ఆనందాన్ని మనోరమ మాటలు భూలోకం లోకి తీసుకొచ్చాయి

"ఆనందంగారూ మా అమ్మకి నాకు పెళ్ళి చెయ్యాలని వుందండీ! మీ అభి ప్రాయం ఏమిటి? చేసుకోమంటారా? ఇప్పటికే పాతికేళ్ళు నిండేయని గొడవ చేసేస్తోంది" అని అతని ముఖంలోకి చూసింది

మనస్సులో చెలరేగిన అల్లకల్లోలాన్ని బైటికి కనబర్చుకోకుండా, మనోరమ మరొకరి సొత్తు కావడం సహించలేని ఆనందం ఈర్ష్యని మొహంలో కనబర్చుకో కుండా గంభీరంగా ఇలా అన్నాడు

"ఈ రోజుల్లో పెళ్ళిళ్ళకి తొందరేమి టిలే ఎంత వయస్సు వాడయినా దొరుకు తున్నాడు. అయినా నీకు పాతికేళ్ళేగా?" అన్నాడు ఏదో జవాబివ్వాలి కనక అన్నట్లు.

"ఆనందంగారూ! ఒక విషయంలో మీ అభిప్రాయాన్ని తెలుసుకోవాలని వుంది పెళ్ళయి, పిల్లలున్న వాడిని ప్రేమించి నప్పుడు, పెళ్ళి చేసుకుని అతనితో కాపరం చెయ్యడంలో తప్పు లేదంటారా మరి మీ అభిప్రాయం ఏమిటి?" అని మనోరమే ప్రశ్నించింది ఆనందాన్ని

ఆమె ప్రశ్నలోని అంతర్యాన్ని గ్రహించిన ఆనందానికి షాక్ కొట్టినట్లుగా అయి స్పృహ తప్పినట్లు చేసింది తను వూహించని, ఎదురు చూడని ప్రశ్న మనోరమ వంటి ఎంతోమంది ఆడవారితో తిరిగేడు. కానీ తన్ని ఎవ్వరూ ఇలా వంటి ప్రశ్న అడగ లేదు ఆమె ప్రశ్నలో అంతర్యం నిజంగా తన్ని పెళ్ళి చేసుకోవడమే అయితే తను ఏం జవాబు ఇవ్వాలి?

నిజంగా ఆమెకి నన్ను చేసుకోవాలని వుందా? రెండో భార్యగా ఉండడానికి అభ్యంతరం లేదన్నమాట మరి తనమాటో? సమాజంలో ఏ ముఖం పెట్టుకుని తిరగాలి? తన బంధువర్గమంతా తన్ని బతకనిస్తుందా?

ఇలా పరిపరి విధాలుగా పోతున్న ఆలో చనల్ని, అతని మనస్సులో రేగిన తుఫాన్ని కనిపెట్టిన మనోరమే మౌనాన్ని భంగ పరుస్తూ -

"తొందర లేదండీ నిదానంగా ఆలో






శాఖలు • సుల్తాన్ బజార్, హైదరాబాద్
• యల్లమ్మగుట్ట, నిజామాబాద్. • గాంధీనగర్, విజయవాడ:
• నెహ్రూరోడ్, కర్నూలు. • పావర్తి బిల్డింగ్స్, గుంటూరు
• ఏలూరు • విజయనగరం • ఖమ్మం • బందరు
• గుడివాడ • కొత్తగూడెం • నంద్యాల • మహబూబ్‌నగర్ • అనంతపురం
• కామారెడ్డి • నిర్మల్ • ఇంకా ఇండియా అంతటా బ్రాంచీలు, ఏజెంట్లు.

గోదావరి సేవింగ్ సిండికేట్
H O రాజమండ్రి.

DIMPLE DESIGNERS

చెందుకుని వారం, పది రోజుల్లో చెప్పండి" అంది.

"ఇప్పటికి ఈ గండం గడిచిందిరా బాబూ" అని మనస్సులో వెయ్యి దేముళ్ళకి మొక్కుకుంటూ—

"ఇక వెళ్దాం పదా!" అంటూ లేచాడు ఆనందం.

ఇంటి దగ్గర లారీ దిగి మామూలుగానే "ఆదివారం హోటల్‌కి తొమ్మిదికల్లా వచ్చెయ్యనా?" అని నవ్వుతూ, వెళ్ళి చెప్పిన మనోరమతో కలిసి మామూలుగా నవ్వలేక బలవంతాన్ని "తొమ్మిదికే వచ్చెయి" అని చెయ్యి వూపి కారు స్టార్టు చేశాడు.

మర్నాడు ఆఫీసుకి వచ్చిన మనోరమలో ఏ మార్పూ లేకపోవడం ఆనందానికి కొంచెం ధైర్యం కలిగింది. ఎప్పటిలాగే ఆ రోజూ ఆమెతో సరసాలాడుతూ ఆఫీసు పని ముగించాడు. ఆమె ఈ ప్రవర్తన అతనిలో రేగిన మోహాన్ని దాన్ని చల్లార్చింది. "రేపు హోటల్లో ఆమెని అనుభవించాక నిదానంగా విషయాలు చూసుకోవచ్చులే" అన్న ధీమా కలిగింది. "వింతగా మళ్ళీ అడిగితే నా అభిప్రాయాన్ని నిక్కచ్చిగా చెప్పేస్తాను.

## ఆంతర్యం

ఏంచేస్తుంది? ఇప్పుడు ... పెట్టిందా— వుద్యోగం వూడపీకించి, సర్వనాశనం చెయ్యగల పదవిలో వున్నాను అయినా చూద్దాం, తొందరెందుకు?" అని సమాధాన పర్చుకున్నాడు.

సంతోషంగా గడిచిన శనివారం, వారం రోజులుగా ఎదురు చూసే ఆదివారం వచ్చి వెళ్ళిపోయింది. "అబ్బా అర రోజులో ఆఫీసు కెళ్ళాలిరా" అనుకునే వుద్యోగస్తులకి, 'అబ్బా బడికి వెళ్ళాలిరా' అనుకుని బాధపడే విద్యార్థులకి ఈ సోమవారం రాగానే తన సుఖ, సంతోషాలని లాక్కోని వెళ్ళే రాక్షసి వచ్చినట్లు వుంటుంది.

ఆనందం ఆఫీసులోకి వస్తూనే ఆత్రుతగా మనోరమ కూర్చునే కుర్చీవైపు చూశాడు. ఎప్పుడూ టైముకి ఆఫీసుకివచ్చే మనోరమ ఈరోజు పన్నెండు కావస్తున్నా రాకపోవడం అందరికీ ఆశ్చర్యంగానే వుంది. అందులో ఆనందానికి ఆత్రుతగానూ, ఆశ్చర్యంగానూ, నిరాశగానూ కూడా వుండడం సహజమే.

పన్నెండు దాటాకా నెమ్మదిగా ఎప్పటిలాగే వయ్యారంగా నడుస్తూ వస్తున్న మనోరమని చూసి గుస గుసలాడుకునే ప్రతీ ఒక్కరూ తమ తమ సీట్లకి వెళ్ళి పని ప్రారంభించారు. తిన్నగా తనసీటుకి వెళ్ళకుండా తన హేండ్ బ్యాగ్‌లోంచి కొన్ని కవర్సుని తీసి ఆఫీసులో అందరికీ పంచడం చూసి ప్రతీ ఒక్కరూ ఆ కవరులో ఏముందో తెలుసుకోడానికి ఆత్రుత పడసాగేరు. అందరికీ ఇచ్చాకే ఆనందం గదిలోకి వెళ్ళింది.

ఇంత సేపటి నుంచీ ఆమె కోసం ఎదురు చూసిన ఆనందానికి తలుపు దగ్గర ఆమెని చూడగానే ఇందాకటి ఆత్రుత, నిరాశా కోపంగా మారేయి.

"నిన్న హోటల్‌కి రాలేదేం? ఎంతలా రోజల్లా నీకోసం వెయిట్ చేశానో తెల్సా? ఇంత నిరుత్సాహ పరుస్తావనుకోలేదు ఇష్టం లేకపోతే రానని ముందే చెప్పి వుండవలసింది' అంటూ ఏమేమో అంటున్న ఆనందం వైపు చిరునవ్వుతో చూస్తూ "మొన్న వూరి నుంచి మా అక్కా బావగారూ వచ్చారు పార్కు నుంచి వెళ్ళేటప్పటికే వాళ్ళు నా కోసం ఎదురు చూస్తున్నారు. మిమ్మల్ని డిసప్పాయింట్ చేసినందుకు మన్నించండి తప్పకుండా నీకు

# "ఈగిల్ స్నాచ్ గురించి వేరే చెప్పాలా ?"



**"ఇది మీతో వచ్చేందుకు సిద్ధం...!"**
ఎక్కడికైనా సరే!



**"ఇది ఎంతో అనువైనది..."**
చెమ్మను ఏమాత్రం లోనికి పోనివ్వదు 24 గంటలకు పైగా
వేడిని ఏమాత్రం బయటికి రానివ్వదు.




**"మరేమిటనుకున్నారు
ఇది ఈగిల్ వాక్యూమ్ ఫ్లాస్క్."**




**ఈగిల్ శ్రేణిలో 123 వేర్వేరు నమూనాలు.**

CASL 111-244-TEL

కావేసిన అనందాన్ని మనస్ఫూర్తిగా కలగ చేస్తా'' నంటూ మనోరమ అన్న మాటలకి ఆనందం మళీ పాతమూడ్సులోకి వచ్చాడు—

''పరవాలేదులే వచ్చే ఆదివారం తప్పక రావాలి'' అంటూ కొంటె నవ్వు నవ్వేశాడు.

''ఈ రోజు శలవు కావాలండీ!'' అని అవడమే తడవుగా—

''దాని కింత దూరం రావాలా ? ఫోన్ చేస్తే సరిపోయేది, అయినా రేపు వచ్చి నప్పుడు చెప్పొచ్చుగా!'' అన్నాడు.

''అది కాదండీ నిన్న హోటల్‌కి రాలేక పోయినందుకు కారణం చెప్పి, క్షమార్పణ అడగడానికి వచ్చానంతే'' అంటూ మృదువుగా చిన్న నవ్వు నవ్వి తలుపుదాకా వెళ్ళిన మనోరమ, ఏదో మర్చిపోయినట్టుగా తిరిగి వచ్చి బ్యాగ్‌లోంచి దళసరి కవరుతీసి అందించింది ఆఫీసు కవరు అనుకున్న ఆనందం దాన్ని పక్కన వుంచి, మెల్లగా నడుస్తూ వెళ్తున్న ఆమె అందాన్ని ముగ్ధుడై ఆస్వాదించసాగేడు ఆ వెళ్ళిన వెంటనే వచ్చే ఆదివారం ఆమె పొందులో పొందబోయే ఆనందాన్ని గురించి తల్చుకుంటూ, ఉత్సాంగే మనస్సుతో ప్రక్కనున్న కవరు చింపేడు.

అందులోనుంచి తీసిన శుభలేక, దానితో బాటు జత చేసిన పెద్ద వుత్తరం అతనిలో ఆశ్చర్యాన్ని ఆతృతనీ కలిగించింది

మా మరదలు చి సౌ మనోరమని ..

చి ఆనందానికి ఇచ్చి వివాహమహోత్సవం జరిపించడానికి పెద్దలు ...

మిగతా అక్షరాలని చదవబోయిన ఆనందానికి కళ్ళు బైర్లు కమ్మి, తన చుట్టూ ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లయింది. ఏం అంతుచిక్కక, మతిపోయినట్లు ఇటూ, అటూ చూడసాగేడు.

ప్రక్కనున్న మంచినీళ్ళ గ్లాసు అందుకుని, కొద్దిగా తాగి, కాస్త తేరుకుని, వెనక ముత్యాల కోవలా వున్న అక్షరాలతో మనోరమ వ్రాసిన వుత్తరాన్ని చదవసాగేడు.

ఆఫీసర్ గారికి

ముందుగా సంబోధన మార్చినందుకు క్షమించండి ఏంతయినా మీరు మా బాస్ కదా ? ఈ వుత్తరంతో వున్న శుభలేక మిమ్మల్ని ఎంత ఆరాట పరుస్తుందో నాకు తెల్సు ఆనందం అన్న పేరు మీది కాదు లెండి. మన ఆఫీసులోనే యు డి. సి గా ఈ మధ్యనే బదిలీ అయిన వి ఆనందం

# ఆంతర్యం

గారిది వివాహానికి తప్పక వస్తారు కదూ ?

అన్నట్లు మీకు పై పేరా చదవగానే మనస్సు కుదుటపడినా నా మీద కోపం, కక్ష మీలో ప్రజ్వరిల్లాయని నాకు తెలుసు. నన్నొక మోసగత్తెగా వూహించుకుంటూ వుంటారు దయ చేసి వుత్తరం సాంతంగా చదవండి.

మాది అసలు హైదరాబాదు చిన్న ఉద్యోగి అయిన రంగారావుగార్కి మేమిద్దరమే ఆడపిల్లలం. బి ఏ. పూర్తిచేసిన మా అక్కకి పెళ్ళి చెయ్యాలని సంబంధాలు చూడటం ప్రారంభించారు అతి కష్టం మీద ఓ ఆరువందల రూపాయల జీతగాడిని తీసుకొచ్చారు. వున్న రెండెకరాల భూమి అమ్మి కట్నం, లాంచనాలూ కలిపి ఎనిమిది వేలకి కష్టంమీద పెళ్ళివారిని వప్పించి, ముహూర్తం పెట్టించారు. పెళ్ళి దగ్గర కొస్తోంది పనులు హడావిడిగా అవుతున్నాయి పెళ్ళి శుభలేఖలు బంధు

వర్గానికి పోస్టు చేశాం. పెళ్ళి ఇంకో వారం వుందనగా మా నాన్నకి పెళ్ళికొడుకు తండ్రి దగ్గర నుంచి ఓ పిడుగులాంటి వుత్తరం వచ్చింది

''ఆఫీసు పనిమీద హైదరాబాదు వచ్చిన మా అబ్బాయికి ఓ రోజు సినిమాహాల్లో కాలేజీ అబ్బాయిలతో బాటు మీ పెద్దమ్మాయి సినిమాకి వెళ్ళడం చూశాడట ఎంత బి ఏ చదివినా అలా విచ్చలవిడిగా కాలేజీలో తోటి విద్యార్థులతో సినిమాకి వెళ్ళడం మావాడికి నచ్చలేదుట అందుకు మీ సంబంధం చేసుకోడానికి మా వాడు ఏ మాత్రం ఇష్టపడటం లేదు కాబట్టి ఈ పెళ్ళి జరగదు. ఇలా వ్రాసినందుకు మన్నించండి'' అని ముగించారు.

పిచ్చి ఎక్కినట్లు కూలబడిన మా నాన్నని చూసి జరిగిన సంగతి తెలీక మా అమ్మ కంగారు పడసాగింది. మెల్లి మెల్లిగా ఈ వార్త నాలుగు మూలలకీ పాకింది. ఎవరికి తోచినట్లు వారు వూహించారు ''ఏ కారణంగా పీటలమీద పెళ్ళి ఆగి పోయిందో? ఏం కళంకం వుందో?'' అని అంతా అనుకోవడంతో మా అక్కకి మళ్ళీ సంబంధాలు రావడమే కష్టమైంది. ఈ బెంగతో మా నాన్న మంచం పట్టి, గతించారు. ఉదారుడైన ఒక మహనీయుడు మా బాధలనీ, కష్టాలని తెలుసుకుని, మా అక్క జీవితానికి వెలుగు ప్రసాదించాడు ఇప్పుడది పెద్ద ఆఫీసర్ భార్య

ఈ కథ అంతా వింటే వింతగా వుంది కదూ? ఇరవయ్యవ శతాబ్దంలో కూడా అటువంటి మగవాళ్ళు వుండడం ఆశ్చర్యంగా లేదూ? కో ఎడ్యుకేషన్ వున్న ఈ కాలం లోను ఆడా, మగా భేదం లేకుండా చదువుతున్నారు ఆఫీసుల్లో చెయ్యీ, చెయ్యీ కలిపి వుద్యోగాలు చేస్తున్నారు. అటువంటి కాలంలో కాలేజీ అమ్మాయిలు తోటి విద్యార్థులతో సినిమాకి వెళ్ళడం తప్పా?

క్షమించండి— మరో చిన్న కథ మొన్న మా స్నేహితురాలు తన భర్తకి ఈ వూరు బదిలీ అయిందనీ, తనని వచ్చి కలుస్కోమనీ, తను రాలేననీ, తన పరిస్థితి అందరి ఆడవాళ్ళ లాంటిదికాదనీ వుత్తరం వ్రాస్తూ ఎడ్రసు పంపించింది ఆ ఎడ్రసు వెతుక్కుంటూ వెళ్ళేను. కనుచీకటి పడింది. గేటు తీసుకుని లోపలికి వెళ్ళిన నాకు పెద్ద

# ఎకాడమి ఎవార్డు

''తెలుగు నవల మనోవిశ్లేషణ అనే విషయంపై సాహిత్య ఎకాడమివారు ప్రకటించిన సాహిత్య విమర్శ గ్రంథాల పోటీలో శ్రీ కోడగారి శ్రీరామమూర్తి గారి రచించిన



గ్రంథానికి రూ 3500 బహుమతి లభించింది. రచయిత బొబ్బిలిలోని రాజా ఆర్ ఎస్. ఆర్ కె రంగారావు కళాశాలలో ఆర్థిక శాస్త్రోపన్యాసకులుగా పని చేస్తున్నారు

# 1 అప్ యొక్క 2 బిళ్లలు ఒక్క బిళ్ల ధరలోనే!







లక్కీ రేపర్‌ను తెచ్చుకుని ఒక బిళ్లను తీసుకోండి ఉచితంగా

ASP/NL 1 UP/2

**1 అప్** ది ఛాంపియన్ డిటర్జెంట్ కేక్!

ఈ కానుక దక్షిణ భారతదేశంలోని ఎంచబడ్డ మార్కెట్లలో ఉంది. ఇది సరుకువున్నంత వరకు.

## ఆంతర్యం

పెద్ద కేకలు ఇంట్లోంచి వినపడడంతో వీధి గుమ్మం దగ్గరే నిలబడి పోయాను.

"ఎన్నిసార్లు చెప్పినా? సిగ్గులేదూ? ఆడదానివి కాదూ? వీధిలో కిటికీ దగ్గర నిలబడి వచ్చే పోయే వారికి నీ వంపు సొంపుల్ని చూపిస్తున్నావా? ఛీ ఛీ మీ ఆడ జాతి అంతా ఇంతే. సిగ్గూ లజ్జా లేదు, నా పరువేం కావాలి? ఆఫీసర్ భార్య రంకుదని చెప్పుకుంటే నలుగుర్లో తల ఎత్తుకుని తిరగాలా? ఇంకెప్పుడయినా బైట కనపడు చెప్తా" అంటూ వేస్తున్న అరుపులు విని నిశ్చేష్టురాలినయి పోయాను. ఆ గొంతు బాగా అలవాటయింది. ఇంక లోపలికి వెళ్ళబుద్ధి వెయ్యక, మనస్సులోనే ఆ ఇల్లాలియందు సానుభూతి కనపరుస్తూ, వెనక్కి తిరగబోతున్న నాకు ఆ ఇంటి గోడ పైని నేమ్ ప్లేటు కనబడింది. నా సందేహం తీరిపోయింది. చకచకా ఇంటికొచ్చేశాను.

ఈ రెండు కథలూ విన్నాక మీ కేమిటనిపిస్తోంది? మీకు పెళ్ళయి, నాకు పెళ్ళి కాబోతూ కూడా ఆఫీసులో మనం ఒకరితో ఒకరం విచ్చలవిడిగా, ఎంత హాయిగా గడుపుతున్నాం? ఇలాంటి మనకి ఆ కథలు వింటే ఎంతో ఎబ్బెట్టుగా వుంటాయి కదూ!

కానీ ఒక్క సందేహం — ఒకవేళ పై రెండు కథల్లో హీరోలుగా మీరు నటించి వుంటే, మొదటి కథలో హీరోయిన్ మా అక్క అయితే, రెండో కథలో హీరోయిన్ మీ భార్య + నా స్నేహితురాలు అయివుంటే ఏంచేస్తారు?

మరో చిన్న విషయం — గురువుగారూ! మా అక్కని తిరస్కరించిన మిమ్మల్ని ఆఫీసర్‌గా వచ్చినరోజే గుర్తుపట్టేను. మీ గురించి, ఆడవారి పట్ల మీ ప్రవర్తన గురించీ ఆఫీసులో చెప్పుకోగా విని, మీకు ఒక గుణపాఠం నేర్పడానికే ఇన్ని రోజులూ మీతో ఈ నాటకం ఆడినందుకు క్షమించండి.

"మీ ఇంటి ఆడది బైటకే రాకూడదు" అనుకునే మీరే ఎంతమంది నాలాంటి ఆడవాళ్ళని బైటకి లాగి, వారి జీవితాలని నాశనం చేస్తున్నారో ఒక్కసారి వూహించుకోండి. రెండో భార్యగా తాళికట్టే ధైర్యం

# ధర్మమంటే ఏమిటి ?




బులుసు
వేంకట
రమణయ్య

మన పూర్వకాలపు రాజులు ధర్మంగా ప్రజలను పాలించేవారనీ, అధర్మం లేకుండా ఉండేదనీ అంటారు. ఉత్తముణ్ణి చూసి "ఆయన ధర్మాత్ముడు" అని అంటారు. అయితే "ధర్మమంటే ఏమిటి?" అని ప్రశ్న వేస్తే సులభంగా సమాధానం రాదు. ధర్మానికి లక్షణం లేకపోలేదు. దాన్ని పెద్దలే నిర్ణయించారు.

"ధృతిః క్షమాదమో౽ స్తేయం
శౌచమింద్రియ నిగ్రహః,
ధీర్విద్యా సత్య మక్రోధః
దశకం ధర్మలక్షణమ్."

ధైర్యము ఓరిమి, కష్టాలను సహించే శక్తి, ఇతరుల సొత్తు అపహరించకుండుట, ఆచారము, ఇంద్రియ నిగ్రహం, మంచి బుద్ధి, విద్య, సత్యము, కోపము లేకుండుట, అనే పది ఉత్తమగుణాలు ధర్మంయొక్క స్వరూపమని అభిప్రాయం. అంటే ఉత్తమ గుణాలన్నీ ధర్మంకింద లెక్కకు వస్తాయి. విపత్తు చిక్కులు తటస్థించినా కొంచెమైనా అధైర్యపడకూడదు. అన్ని పరిస్థితులలోనూ ధైర్యాన్ని అవలంభించి ఉండాలి.

ఏ విషయంలోనూ తొందరపాటు ఉండ కూడదు. శాంతం అవలంభించి ఉండాలి.

మూడవది దమము. దమమంటే ఇంద్రియనిగ్రహమనే అర్థం ప్రసిద్ధంగా ఉన్నది. కాని, ఈ శ్లోకంలో ఇంద్రియ నిగ్రహాన్ని కూడా వేరే చెప్పడంవల్ల — ఈ దమ శబ్దానికి వేరే అర్థం చెప్పుకోవాలి. ఆ అర్థమే దుఃఖాలను సహించే శక్తి. ఎట్టి కష్టాలు వచ్చినా చలనం లేకుండా ఉండ గల్గడమన్నమాట. తర్వాతిది అస్తేయం. అంటే ఇతరుల వస్తువులను అపహరించకూడదు. స్తేయం అంటే దొంగిలించడం. అంతే కాదు. తనదికాని వస్తువు ఎక్కడైనా దొరికినా, దాన్ని తాను తీసుకోరాదు. దాని యజమానిని తెలుసుకుని అతనికి అందే టట్లు చెయ్యాలి.

మరొకటి శౌచం — అంటే పరిశుద్ధత. ఎట్టి పరిస్థితిలోనూ అపరిశుద్ధంగా ఉండ కూడదు. తర్వాతది ఇంద్రియ నిగ్రహం. ఆయా ఇంద్రియాలు ఇంద్రియార్థాల వైపు పరుగెత్తకుండా, వాటిని అదుపు చేసుకోవాలి. అంటే విషయాభిలాషను పూర్తిగా విడిచి పెట్టాలి. ఇంకొకటి నిశితమైన బుద్ధి. అదే మంచి బుద్ధి. బుద్ధిమంతుడెప్పుడూ మంచి తలపులే కలిగి ఉంటాడు.

తొమ్మిదవది విద్య; విద్య వివేకాన్నిస్తుంది. దానివల్ల యుక్తాయుక్తాలు తెలిసి, మనస్సు మంచివైపే మొగ్గుతుంది.

తర్వాతిది సత్యం. యథార్థం పలుకుట ఎంత ఉత్తమమో అందరికీ తెలుసు. సర్వమూ సత్యం పైనే నిలిచి ఉన్నదని గదా అందరూ అంటారు. చివరిది అక్రోధం. తప్పు ఎవ్వరేమన్నా, ఏ రీతిగ హింసించినా కోపం తెచ్చుకోరాదు.

ఈ పదువన్నీ ఉత్తమగుణాలు. వీటిని ఆచరణలో పెట్టడమే ధర్మస్వరూపం.

---

లేని మీకు హోటళ్లల్లో పరాయి స్త్రీలతో కులకడానికి ధైర్యం ఎక్కడి నుంచి వచ్చింది ? భార్య బైట నిలబడితేనే పరువు పోతుందనుకునే మీకు బైట స్త్రీలతో తిరగడం ప్రతిష్ఠని తెస్తోందను కుంటు న్నారా ?

గాబరా పడకండి— ఆఫీసులో సంచలనం కలిగించిన మన కథ అంతర్యాన్ని మనలోనే వుంచుతాలెండి ! దయచేసి భార్యని భార్యగా చూసి, పరాయి స్త్రీని గౌరవించడం నేర్చుకోండి. నా కాబోయే భర్త అయిన ఆనందంగారికి మ్రాతల ఈ నా డ్రామా తెల్సు. ఈ పుత్తరం వెనక నా రిజిగ్నేషన్ పేపరు వుంది. దయచేసి అంగీకరించ వలసిందిగానూ, ముఖ్యంగా నా ఆఫీసర్‌గా కాకుండా, నా స్నేహితురాలి భర్తగా నా పెళ్ళికి మీ భార్యతో సహా రావలసిందిగానూ మరీ మరీ కోరుతూ —

మీ శ్రేయోభిలాషి
మనోరమ.

ఆ పుత్తరాన్ని చదివి కుర్చీలో కుప్పలా కూలబడిన ఆనందానికి ముచ్చెమటలు పోశాయి. చేతిలో వున్న పుత్తరం ఎవరన్నా చూస్తారేమో అని గబగబా మడిచి జేబులో పెట్టుకున్నాడు.

శుభలేఖలు చదివిన తోటి వుద్యోగస్తు లందరికీ ఒకటే సందేహం. శనివారం సాయంత్రం దాకా పిచ్చ ప్రేమ కలాపాలేమిటి? మరి ఈ పెళ్ళి ప్రకటన ఏమిటి? సాహసించి తమ కుతూహలాన్ని వ్యక్తపరిచినా జవాబుగా చిరునవ్వు తప్ప మరేసమాధానం ఆమె నుంచి రాదని తెలిసిన వీళ్ళంతా బైటకి వెళ్ళిపోతున్న ఆనందం వైపు ఆత్రంగా చూడటం ప్రారంభిం చారు. "అతనిలోనన్నా ఏదన్నా మార్పు కనిపిస్తుందేమో?" అని వారి ఆశ.

అంతకంటే వారిని మరీ ఆశ్చర్య పరిచిన విషయం ఏమిటంటే— ఆనందం భార్యా సమేతంగా మనోరమ పెళ్ళికి రావడమే

## హైదరాబాదు నోట్‌బుక్

### శ్రీ పత్రాయని సంగీతరావు :

కొందరు యోగ్యత కొంచెమైనా తీసుకొని ముందుకు పోతుంటారు. కొందరు ఎంతో యోగ్యత ఉన్నా, దూసుకువచ్చేవారికి దారి ఇస్తూ పక్కకు తప్పుకుని నడుస్తుంటారు. ఈ నివురు గప్పిన నిప్పుల, మరుగున పడిన మాణిక్యాల కాంతి ఎన్నటికీ తరగదు. నివురు తొలగించి, మరుగు చెరిపి ఆనందించగలిగేదే భాగ్యం. అలాంటి నివురుగప్పిన నిప్పు మిత్రులు శ్రీ పత్రాయని సంగీతరావు. ఈయన సంగీతమూర్తి. సంగీతరావు ప్రధాన లక్ష్యం నేర్పక ఉండి ముందున్న వారికి కాంతులు ప్రసరింపజేసి వారిని కాంతిమంతులను చేయడం. వారిది సంగీతమయ త్యాగమయ వంశం. తండ్రి శ్రీ సీతారామశాస్త్రి, తాత శ్రీ వెంకటనరసింహశాస్త్రి సంగీత విద్వాంసులు. ఒరిస్సాలోని పర్లాకిమిడి, జరడా మున్నగు సంస్థానాలలో ఆస్థాన సంగీతవిద్వాంసులు. సంగీతరావు జన్మస్థలం విజయనగరానికి సమీపంలోని సాలూరు. సాలూరులోను, విజయనగరంలోను హైస్కూలు చదువు ముగించారు. అప్పుడే లోకవారు శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుతో పరిచయం కలిగింది. దానితో సంగీతమే ప్రధాన వృత్తిగా జీవితం గడపాలనే స్థిర సంకల్పం కలిగింది. తండ్రి వద్దనే సంగీతం గాత్రం, యంత్ర వాద్యాలు— ముఖ్యంగా హార్మోనియంలో సాధన చేశారు. సంగీతరావు సాధన, పటిమని శ్రీ కవివరం గంగుల అప్పలనాయుడనే శ్రీమంతులు— కళాభిమానులు— తమ వద్ద సంగీతాచార్యులుగా ఉంచుకున్నారు. బోధన సాధనకు దోహదకారి అనే భావంతో వారి ఆశ్రమంలో ఏడు సంవత్సరాలున్నారు సంగీతరావు. అప్పుడు శ్రీ ఘంటసాల లక్ష్మమ్మ చిత్రానికి సంగీత దర్శకత్వం చేస్తూ విజయనగరం వచ్చారు. సంగీతరావును తమ బృందంలో ఉండమన్నారు. కాని అది 1954లో గాని కుదరలేదు. 1954లో తిరుపతి యాత్రకు వచ్చారు సంగీతరావు. సరే, మద్రాసులో ఘంటసాల బృందంలో ఉండిపోయారు. విజయనగరానికి తిరిగివెళ్ళలేదు. ఆ బృందంలో ఉంటూనే నేదునూరి, మహాకవులంటి ప్రముఖ విద్వాంసుల కచేరీలలో హార్మోనియం వాయించేవారు. ఘంటసాల బృందంతోపాటు అమెరికా, ఇంగ్లాండు మున్నగు విదేశాలలో పర్యటించారు. ఒక్క హార్మోనియమే కాక సితార మున్నగు వాద్యాలను కూడా వాయించి బృందానికి కీర్తి తెచ్చారు. ఘంటసాల కీర్తి శమించిన పిదప 1975 నుండి శ్రీ వెంపటి చినసత్యం కూచిపూడి ఆర్ట్స్ అకాడమీలో చేరారు. సంగీత దర్శకులుగా ఆ అకాడమీ ప్రదర్శించే కృష్ణ పారిజాతం, శ్రీనివాస కళ్యాణం, చండాలిక, మేనకా విశ్వామిత్రం, శాకుంతలం మున్నగు నృత్య నాటకాలకు సంగీతం కూర్చారు. పదములను, వర్ణములను సంగీతంలో తీర్చిదిద్దారు. నిరంతర సాధకులు సంగీతరావు. నిండు కుండ నిగర్వ భావాని. కలిసికట్టుతనం. ప్రాచీన నవీన నాట్య బృందాలకు అవసరమని అంటారు. ఇది వైవిధ్యయుగం గనుక ప్రతి సంగీత విద్వాంసుడు ఒక దానిలో నిష్ణాతుడై తక్కినవాటిలో తగినంత పరిచయం పొందిన వాడై ఉండాలంటారు. విదేశీయ విద్వాంసుల నీ సందర్భంలో ఉదహరించారు. సుప్రసిద్ధ వాయులీన విద్వాంసుడు యెహూదీ మెనుహిన్ ఇతర దేశ యంత్ర వాద్యాలు కూడా నేర్చినవాడని ఒకప్పుడు రవిశంకర్ సితారుకు పక్క వాద్యంగా వయొలిన్ వాయించారని, భారతీయ సంగీత సంప్రదాయం క్షుణ్ణంగా తెలియకపోతే అది సాధ్యం కాదని సంగీతరావు స్పష్టం చేశారు. సంగీతరావు గొప్ప మనస్వి. సంతృప్తివిరాజితులు. ఈ మాణిక్య కాంతులు దశదిశలు ఇంకా మహోజ్జ్వలంగా ప్రసరించాలి. ఇలాంటి వారి విద్యను ఆంధ్రావని పూర్తిగా వినియోగించుకోవాలి. ఇంకా ఆయన వయస్సు పట్టుమని ఆరు పదులు లేదు. ఇంకా నాలుగు పదులైనా ఉండి, సంగీత సరస్వతిని ఆరాధిస్తారని నమ్ముతాను.

### తెలుగు చరిత్ర, సంస్కృతి :

అంతర్జాతీయ తెలుగు సంస్థ చేపట్టిన "తెలుగు చరిత్ర, సంస్కృతి" గ్రంథాన్ని 20 సంపుటాలుగా ప్రచురించాలనే నిర్ణయం మారింది. మూడు సంపుటాలుగా ప్రచురించాలని కొత్తగా నిర్ణయించినట్లు సంస్థ డైరెక్టర్ శ్రీ ఎం. రామప్ప తెలియజేశారు. అన్య రాష్ట్రాలలో తెలుగు ఉపాధ్యాయుల కోసం తెలుగు టీచింగ్ అనే త్రైమాసిక పత్రికను తెలుగు ఇంగ్లీషు పత్రికలలో ప్రచురించాలని కూడా సంస్థ నిర్ణయించింది. విదేశాలలోని తెలుగు పిల్లలకు తెలుగు నేర్పడానికి వ్యవహార భాషలో మూడు వాచకాలు సిద్ధమవుతున్నాయని, వీటిని ఉచితంగా పిల్లలకు పంచిపెడతామని శ్రీ రామప్ప అన్నారు. త్వరలో మాడపాటి హనుమంతరావు స్మారకోపన్యాసాలు నిర్వహించ మున్నట్లు కూడా ఆయన అన్నారు.

### ఉపశ్రుతి :

"ఇకనేమండి, లీకయిన ప్రశ్నా పత్రాలకో మళ్ళీ పరీక్ష పెడతారటగా" అన్నాడు ఒక రాజకీయవాది. "ఆఁ సంబడంతే. వాటి కుండల ఎన్ని నీళ్ళు పోస్తే ఏం లాభం? ఎన్నిసార్లు పరీక్ష పెట్టినా కొలేజీ లీకేజీయే!" అన్నాడు ఒక ప్రత్యర్థి రాజకీయవాది.

— తిరుమల రామచంద్ర



స్వీడన్‌లోని స్టాక్‌హోమ్‌లో జరిగిన నోబుల్ బహుమతి ప్రదానోత్సవంలో 1978వ సంవత్సరానికి నోబుల్ బహుమతి నందుకున్న స్విట్జర్లాండ్‌కి చెందిన వార్నర్ ఆర్బర్ (వైద్య శాస్త్రం), అమెరికాకి చెందిన ఐజాక్ బాషెవిస్ సింగర్ (సాహిత్యం), రాబర్ట్ విల్సన్ (భౌతిక శాస్త్రం), డేనియల్ నేథాన్స్ (వైద్య శాస్త్రం) ఆర్నో పెంజియాస్ (భౌతిక శాస్త్రం), హామిల్టన్ స్మిత్ (వైద్యశాస్త్రం), బ్రిటన్‌కి చెందిన పీటర్ మైఖేల్ (రసాయన శాస్త్రం), అమెరికాకి చెందిన హెర్బర్ట్ సైమన్ (ఆర్థిక శాస్త్రం), రష్యాకి చెందిన పయోటర్ కపిట్సా (భౌతిక శాస్త్రం) లను చిత్రంలో చూడవచ్చు.

ఎందుకంత
నాకోసం శ్రమ తీసుకొని
ఉదయాన్నే ఫిల్టర్ కాఫీ
తయారుచేస్తావు?

అదేంకాదు...
ఇది రికొరి
ఇన్‌స్టెంట్

# రికరి®
## ఇన్‌స్టెంట్









*ఇది ఫిల్టర్
కాఫీ వలెనే యెంతో
రుచిగా ఉంటుంది కాబట్టి
తేడాచెప్పడం చాలాకష్టం.*

నెస్ కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్టత తెలిసినవారు

SAA/FSL/R/1135

# ప్రశ్నావళి!

కె. రామలక్ష్మి

**ఆర్. ఆర్. మెట్టుపల్లి**

మగవారి చూపులు అందమైన అమ్మాయిపైనే పోతాయి.

పొరపాటు. ఆడవారి చూపులూ అందమైన అమ్మాయిలపైనే పోతాయి— అది ప్రకృతి సహజం, అందం అందరూ చూడవచ్చు. కాని అందరిదీ అనుకోకూడదు. అంతే.

**కె. ఎస్. పి. గుంటూరు**

బ్రతుకింత చేదుగా ఎందుకుంటుంది? నాకు సుఖమెందుకు లేదు? జవాబే గ్రంథాలలో లభించును?

చాలా లేటుగా తెరిచావయ్యా ప్రసాద్— జీవన పుస్తకం! ఇప్పుడిప్పుడే కూడబలుక్కు చదవడం ప్రారంభించిన నీకు అప్పుడే యిలాంటి ప్రశ్నలకి జవాబులు దొరకవు!

**వి. ఎస్. ఆర్. ఎ. బి; వై. బి. ఖర్గపూరు**

అక్కయ్యగారూ, నేటిరోజుల్లో ఆడపిల్లలకు పెళ్ళి చేయడం ఎంతో మగవాడికి ఉద్యోగం దొరకడం అంతే కష్టం కదా? ఉద్యోగాలకు ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలున్నాయి. మరి వివాహాలకు?

మారేజి బ్యూరోలూ వున్నాయి! అయినా ఉద్యోగం తప్ప అమ్మాయిలో— కట్నాలు తెచ్చే అమ్మాయిలో కావాలని ఒంటికాలుమీద నిలబడే అబ్బాయిలకి ఉద్యోగం ఇవ్వడానికి?

**వై. జె. ఆర్. ఎల్. జయనగర్**

జీవితాన్ని నీటిబుడగతో పోలుస్తారు. మరి అంత క్షణికమా జీవితం?

అనంతకాలమానంతో కొలిస్తే — భూమ్మీద మనిషి జీవితకాలం — క్షణికమే.

నీళ్ళులేని ఎడారిలో ఒక్కరైనా త్రాగి బ్రతకాలన్నా లోక పిసినిని. కన్నీరు దాహంతీరుస్తుందా?

ఆ కవిగారినే వోసారి ఎడారిలో వదిలేస్తే — తెలిసిపోయేది కదా!

**పి. వి. కాజీపేట**

గాంధీపటాలు అన్నీ వృద్ధాప్యంలోనివే కన్పిస్తాయి.

నిజమే. వయస్సులో గాంధీగారు అతి మామూలు మగవాడి కంటే అన్యాయం! అని వారి చరిత్ర చెప్తుంది. గాంధీ బోసినోటి తాతగా, శాంతమూర్తిగా మాత్రమే మన మనస్సులో నిలిచాడు. అందుకని మీకు యువ కన్పించినంత 'చిన్నగాంధీ' బొమ్మలు కన్పించవు.

# వెలకు మించిన విలువ
# ఫిలిప్స్
# 3-బ్యాండ్ల
# ట్రాన్సిస్టర్లు





## పయొనీర్

రెండు షార్ట్‌వేవ్ రేంజ్‌లపై విస్తృతమైన బ్యాండ్ స్ప్రెడ్.
అనువైన సైజు. మనోహరమైన మధుర ధ్వని.
రూ. 305/-*



## ఫిలెటా

బ్యాటరీ శక్తి సన్నగిల్లినా శక్తివంతమైన స్టేషన్లనుండి
వచ్చే అనవసర శబ్దాలు అతి తక్కువ.
గట్టిగా, అవరోధాలేమీ లేకుండా వినిపిస్తుంది. రూ. 330/-*
కరెంటుకు పెట్టుకొనే సదుపాయంతో కూడా లభిస్తుంది.
రూ. 376/-*



## కమాండర్

అత్యంత సునిశితంగా స్టేషన్లను గ్రహించే శక్తి.
నిర్దిష్టమైన ఫైన్ ట్యూనింగ్ ఏర్పాటు. సులభంగా
కరెంటుకు మార్చుకోవచ్చు. రూ. 430/-*

* చిల్లరగా అమ్మే గరిష్ఠ వెల, ఎక్సైజ్ డ్యూటీతో సహా.
రాష్ట్ర అమ్మకం పన్ను, ఇతర స్థానిక పన్నులు అదనం.

**సర్వశ్రేష్ఠమైనదానినే మీరు పొందాలని మా వాంఛ.**

**ఫిలిప్స్**

# ప్రశ్నావళి

**వెంకట్, ఉరవకొండ**

సామాజిక మర్యాదలనుండి స్వతంత్రాన్ని కోరే ప్రేమ శ్లాఘనీయమని మీరు ఎలా అంగీకరించగలరు?

సామాజిక మర్యాద అన్న పదానికి మీరిచ్చే అర్థాన్ని బట్టి వుంటుంది అంగీకరించడంలోనిది. స్త్రీకి ఒక నీతి పురుషునికి వేరొక నీతి, స్త్రీకి ఒక న్యాయం, పురుషునికి వేరొక న్యాయం, స్త్రీకి గుదిబండగా మారిన సాంఘిక మర్యాదను – కాదనడం ద్రోహంగా భావించేసంకుచితులను సవాల్ చేయడం తప్పు కాదు. రెండో. తనకి ఇక్కర్లేదనుకున్నప్పుడు భార్యని తోసివేసే స్వతంత్ర్య మగవాడు, తను భరించలేని కట్లు తెగించి బయట పడాలనుకుంటున్న స్త్రీని తప్పు పట్టడం దేనికి? పిల్లల కోసం కాకపోతే— దేశంలో నేటికి ఎన్నెన్ని సంసారాలు — కొనసాగవు!

**వి ఎమ్. ఆర్ విశాఖపట్నం**

మీరు చెప్పి ఖచ్చితంగా పరిహాసాలే— వెడతారు. కామెంట్?

తప్పుతుందా మరి! రాసే రాతలు అలావున్నాయి చూసే సినిమాలు అలా వున్నాయి పోయే పోకళ్లు అలా వున్నాయి! పని అక్కడేనా కాస్త యువ పట్టు వుండాలని దీవించు గురూ!

**డి. ఆర్. ఆర్. కోరాపుట్**

నేను మరియు ఒక అమ్మాయి చిన్నప్పటి నుంచి కలిసి మెలిసి వుండే వాళ్ళం. అన్ని విషయాలు ఫ్రీగా మాట్లాడుకునే వాళ్ళం. ఒక రోజు అనుకోకుండా మాకు చిన్న తగవు వచ్చింది. ఆ రోజే ఆ అమ్మాయి నన్ను ఒక అనరాని మాట అంది. ఆ వేళ నుంచి నేను మాట్లాడ్డం మానేసినా మరువలేకుండా ఉన్నాను. . .

చంపారు మాస్టారూ! ఇప్పుడా "అనరాని మాట" అని మిమ్మల్ని ఎలా వదులుకుందో తెలుసుకోవాలన్న కుతూహలం నన్ను చంపుతుంది. అయినా గౌరవనీయమైన ఉపాధ్యాయులుగా వుంటూ కూడా— పసివాళ్ళ ప్రేమ వాగుడేం బాగులేదు సార్. కాస్త ఉన్నతంగా ఎదగడానికి ప్రయత్నించండి. అప్పుడూ తగుదునమ్మా అంటూ పిల్లలకి చదువూసంధ్యా నేర్పినా అందం చందం.

**జి. ఎమ్. ఎస్. పెనుమంట్ర**

ప్రపంచంలో డబ్బు వున్న వాళ్ళని గౌరవంగా లేని వాళ్ళని నీచంగా చూస్తారు. నువ్వు అంతేనా అక్కయ్యా ...

భయపడకు సోదరి— నేనూ రెండో జాతి దాన్నే. నాకు డబ్బు ఉన్నా— లేకున్నా ఒకటే.


Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor S Radhakrishna

RADEUS/PB/M 1



మాజా మేలైన జీవనానికి-
ప్రపంచంలోని పెద్ద పట్టణాలలో
మీరు వాడే తరహాకి చెందిన
రుచిగలది-స్ట్రాబెర్రీ, పైనాపిల్,
మరియు ఆరంజ్ రుచులలో!
చల్లటి నీటిలో కలుపండి.
వెంటనే మీకొక రుచికరమైన పానీయం తయారవుతుంది.
సుఫ్లే-లస్సీ, కాక్‌టెయిల్
మొదలైన వాటితో బాగా
కలిసి పోతుంది.




మాజా అతి మేలైనది. మాజా మీరెప్పుడిచ్చినా, ఇచ్చే
ప్రతి ఒక్కసారి అదివక ప్రత్యేక సందర్భమనిపిస్తుంది
మీ పిల్లలు, అతిథులు దాని పండ్ల రుచిని ఇష్టపడతారు
మాజా పోషకారి-దానిలో విటమిన్ ఎ సి & డి మరియు
కాల్షియం ఉన్నవి ఒక గ్లాసు మాజా పెద్దలకు ప్రతి
రోజు కావలసిన 75% విటమిన్ సి ఇస్తుంది నేడె మీ
ఇంట్లో ఒక మాజా సీసా ఉంచండి




— మీకు మరియు మీ అతిథులకు.
జీవితంలో మంచి వస్తువులు మాత్రమే
వాడే అలవాటు గల వారికి

*FREE! Write for Maaza Recipe Book which tells you all about the many delicacies you can prepare with Maaza, to Parle Beverages Pvt Ltd., MID Department, Western Express Highway, Chakala, Andheri (E), Bombay 400 093*

